# ఆంధ్రపత్రిక



Regd. No. M. 1118 సంపుటం 38. సంచిక 93 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO. బుధవారం 4-7-1951 వెల 1 అణా.

# పాకిస్తాన్‌పై తిరిగి భద్రతా మండలికి భారత ప్రభుత్వ ఫిర్యాదు

## కమ్యూనిస్టు సూచనల ప్రకారం కేసంగ్‌లోనే యుద్ధ విరమణ చర్చలు

### కొరియా, చైనా ప్రతిపాదనకు సమితి సేనాని అంగీకారం

టోకియో, జూలై 3: కొరియాలో పోరాడుతున్న ఉభయపక్షాల సైన్యాధిపతులు యుద్ధవిరమణకై కేసంగులో చర్చలు జరపాలంటూ కమ్యూనిస్టులు చేసిన ప్రతిపాదనను సమితి సర్వసైన్యాధ్యక్షుడు జనరల్ రిడ్జివే ఈ రోజున అంగీకరించాడు.

కమ్యూనిస్టు సైన్యాధిపతుల ప్రతినిధులను కేసంగులో జూలై 10-వ తేదీనిగాని, సాధ్యమైతే అంతకుముందుగాని కలుసుకోవడానికి తన ప్రతినిధులను పంపడానికి సంసిద్ధంగా ఉన్నట్లు జనరల్ రిడ్జివే ప్రకటించారు.

ప్రతినిధుల సమావేశానికి ఏర్పాట్లు చేసే నిమిత్తం తన క్రింది లెయిసాన్ అధికారులలో ముగ్గురిని కమ్యూనిస్టు సైన్యానికి చెందిన ముగ్గురు లెయిసాన్ అధికారులు కేసంగులో జూలై 5 వ కలుసుకోవాలనికూడా ఆయన సూచించారు. సమితి లెయిసాన్ అధికారవర్గం సియోల్‌లోని కింపో విమానాశ్రయం నుండి జూలై 4 వ హెలికాప్టర్ విమానంలో కేసంగుకు బయలు దేరతారని జనరల్ రిడ్జివే ప్రకటించారు.

జనరల్ రిడ్జివే సమాధానాన్ని నేటి అపరాహ్ణం 2-35 గంటలకు రేడియో ద్వారా బ్రాడ్‌కాస్టు చేశారు. ఆ సమాధానం జనరల్ కిమ్‌ఇల్‌సుంగు, జనరల్ ...

అంతటా మందుగనులు మాటు పెట్టబడివున్నాయి. ఈ మందుగనులను తివ్వి తీసి సమావేశ స్థలాన్ని ముందు నిరపాయం చేయవలసి వుంటుంది. కమ్యూనిస్టులు ఏడాది వారం రోజుల క్రితం దక్షిణ కొరియామీద దండయాత్ర ప్రారంభించినప్పుడు మొట్టమొదట పట్టుకొన్న పట్టణం యిదే. ఐక్యరాజ్య విమానదళాలు ఎడతెగకుండా దాళ్లు జరిపి ఈ పట్టణాన్ని ఇంచుమించు ధ్వంసం చేశాయి.

కమ్యూనిస్టులు పంపిన ప్రత్యుత్తరపాఠాన్ని ఐక్యరాజ్య సమితి అధికారులు జాగ్రత్తగా మళ్లీ మళ్లీ చదివి లోపలవున్న నిగూఢార్థాలను శోధించ...

### సమావేశ తేదీ గురించి పెకింగు రేడియో వ్యాఖ్యానం

టోకియో, జూలై 3: యుద్ధవిరమణ సంప్రతింపులను జూలై 10-వ తేదీ 15-వ తేదీలమధ్య ప్రారంభించాలని ఎందుకు ప్రతిపాదించవలసి వచ్చిందో పెకింగురేడియో యీ వేళ వివరించింది. యుద్ధంవల్ల కొరియాలో రాక పోక సౌకర్యాలు విచ్ఛిన్నమై పోవటం ఒకటి. యుద్ధవిరమణ సంప్రతింపులకు తయారు కావటానికి సహజంగా కొంతవ్యవధానం అవసరం అవటం ఒకటి. ఈ రెండు కారణాలవల్ల సమావేశ తేదీని అంతదూరానికి నెటవలసి వచ్చిందనీ, ఇన్ని ఇబ్బందులవులోనె కూడా సన్నాహాలన్నీ ఒక్క పదిరోజుల్లోనే పూర్తిచేయ గోరుతున్నారంటే అది ఏమీ స్వల్పవిషయంకాదనీ పెకింగురేడియో వ్యాఖ్యానించింది.

వాలని మాత్రమే సూచించారో వారి ప్రత్యుత్తరాన్ని బట్టి స్పష్టంగా తెలియటం లేదని సమితి అధికారులు అంటున్నారు.

కేసంగ్‌లో జరిగే సమావేశంలో ఉభయపక్షాల ప్రతినిధులు అంతిమ నిర్ణయాలంటూ ఏవీ చేయరనీ, ఇరు పక్షాలవారూ ఒకరి అభిప్రాయాలను ...

వాషింగ్టనుకు తిరిగిరాగానే రక్షణశాఖామంత్రి జార్జి మార్షల్, విదేశాంగశాఖామంత్రి డీన్ అచిసన్‌లతో సమావేశమై జనరల్ రిడ్జ్వే సందేశానికి కమ్యూనిస్టులు పంపిన ప్రత్యుత్తరం గురించి సంప్రతింపులు జరిపాడు. మరి కొంతసేపటికి వాషింగ్టన్ టోకియోల మధ్య రేడియో ద్వారా ఉత్తర ప్రత్యు...

తన సమాధానంలో ...

ట్రూమన్ సంప్రతింపులు

వాషింగ్టన్, జూలై 2: ...

### విజయవాడ మున్సిపల్ కాంగ్రెస్ పార్టీ సమావేశం

తిరిగి జులై 4 తేదీకి వాయిదా

విజయవాడ, జూలై 1: మొన్న సాయంత్రం విజయవాడ మ్యునిసిపల్ కాంగ్రెసుపార్టీ శ్రీ కాకరపర్తి భావనారాయణ అధ్యక్షతక్రింద సమావేశమయింది, 23 మంది కాంగ్రెసు సభ్యులకు 18 మంది కాంగ్రెసులోనే ఉన్నట్లు సమావేశాహ్వాన పత్రింపై సంతకాలవల్ల తేలుతోందని భావన్నారాయణగారన్నారు. సమావేశానికి 7 గురు వచ్చారని వారు తెల్పారు. తిరిగి జూలై 4 వ తేదీనాడు సమావేశమవటానికి నిర్ణయించారు. కాంగ్రెసు పార్టీ కార్యదర్శి కావలసిన దస్త్రాలు పట్టుకొని రానందువలన యీ వాయిదా అవసరమైనదట. సమావేశానంతరం శ్రీ కాశేశ్వరరావు "కాంగ్రెసుపార్టీ యథాతథంగానే ఉన్నది. కాకపోతే తక్కువమంది సభ్యులు రావటం మామూలే" అన్నారు. (స్వ. వి.)

## యుద్ధ విరమణ ఒడంబడిక ఉల్లంఘన సందర్భాలను వివరిస్తూ నెహ్రూ లేఖ

### 'సైనికాధికారులతో సంప్రతింపులకు రావల్సిందికి సమితి సైనిక ఉద్యోగి నిమ్మో ప్రయాణం'

న్యూయార్కు, జూలై 2: కాశ్మీరు యుద్ధవిరమణ సంధి సరిహద్దును పాకిస్తాను వరుసగా అతిక్రమించడంపై ఇండియా ఈ రోజున భద్రతా మండలికి తన ఆక్షేపణ తెలియపరిచినది.

ఈ సందర్భంలో భారతప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ పంపిన లేఖను సమితిలోని భారత ప్రతినిధివర్గ నాయకుడు శ్రీ బి. ఎన్. రావు భద్రతామండలి అధ్యక్షునికి అందచేశారు. గత పదుండినాలలో పాకిస్తాన్ మూడు పర్యాయాలు యుద్ధ విరమణ సంధిని ఉల్లంఘించినట్లు ఆ లేఖలో ఆరోపణ జరిగినది.

భారత ప్రధాని పంపిన లేఖలో ఇలా ఉన్నది: ఈ సంఘటనలలో ఒకటి ఇండియాలో చేరిన జమ్మూరాష్ట్రంలో సరిహద్దుకు 800 గజాల దూరంలో జరిగినది. పాకిస్తాన్ సైనికులు రహస్యంగా పొంచుండి ఇరువురు భారతసైనికులపై బడి వారిని ...

"... చాల తీవ్రమైనవి. వాటిపై ఆక్షేపణ తెలుపుతూ, యుద్ధవిరమణ సంధిషరతులను పాకిస్తాన్ పాటించేటట్లు చేయడానికి తగినచర్యలు జరుపవలసినదని ఇండియా కోరుతున్నది."

సోవియట్ ప్రతినిధి జాకొబ్

(4-వ పేజీ చూడుడు)

### సింహళ భారతీయుల వోటింగు హక్కు

కేగల్లె జిల్లాజడ్జి తీర్పు

కొలంబో, జులై 2: సింహళప్రభుత్వపు 1949 వ సంవత్సరపు వోటింగు హక్కు సవరణ చట్టం (భారతీయుల వోటింగుహక్కును పరిమితంచేసే చట్టం) సింహళ రాజ్యాంగంలోని 9వ సెక్షనుకు విరుద్ధంగావుందని కేగల్లెజిల్లా జడ్జి ఈవేళ ఒకతీర్పులో వ్యాఖ్యానించాడు. 1935 వ సంవత్సరంనుంచి తాను వోటరుగా వుంటున్నాననీ, కాని పైచెప్పిన సవరణచట్టం మిషతో 1950 లో తన పేరును వోటర్ల పట్టీనుంచి తొలగించాలనీ, ఇది అక్రమ చర్యగా నిర్ణయించవలసిందనీ కోరుతూ గోవిందన్ పిలప్ప నాయర్ కోడకన్ పిళ్ళై అనే సింహళ భారతీయుడు దాఖలుచేసిన అప్పీలుమీద జిల్లాజడ్జి పై విధంగా తీర్పు చెప్పారు.

### భారతదేశంపై సేనా నాయకే విమర్శ

### ప్రజాపార్టీలో ఉన్న కాంగ్రెసు సభ్యులు

టాండన్ ప్రకటన

## డిసెంబరులోనే చెన్నరాష్ట్రంలో ఎన్నికల నిర్వహణ

### అక్టోబర్లో ప్రారంభించి దేశంఅంతటా సంవత్సరాంతంలోగా పూర్తిచేయడానికి ఏర్పాట్లు

న్యూఢిల్లీ, జులై 2: దేశంఅంతటా జనరల్ ఎన్నికలు రాబోవు అక్టోబరునుండి డిసెంబరు వరకు మూడు మాసాల పర్యంతం జరుగుతవి. తమతమ రాష్ట్రాలలో ఎన్నికలు జరుపటానికి తగిన తేదీలను వివిధరాష్ట్రీయ ప్రభుత్వముల వారూ ఎలెక్షను కమిషనరుకు తెలియజేసియున్నారు.

ఎన్నికల సన్నాహములన్నీ జులై అంతములోపుగా పూర్తి అవుతవి.

బీహారు డిసెంబరు 3 నుండి 15 వరకు; ...

### సమూనా ఎన్నిక

### ఆటవిక ప్రాంతాల అభివృద్ధికి భారత ప్రభుత్వ పథకము

శ్రీ తిరుమలరావుగారి వివరణ

## మూవెస్టులోయి సమస్య పరిష్కారానికి అమెరికా రాయబారి కృషి సైఫల్యం

### బుడాపెస్టులోని అమెరికన్ అధికారులు

### భద్రతా మండలికి పర్షియా బ్రిటన్‌పై ఫిర్యాదుచేసే సూచన

(2-వ పేజీ చూడుడు)

### టిబెట్టు-ఇండియా సరిహద్దులలో కమ్యూనిస్టుచైనా సేనలు

(4-వ పేజీ చూడుడు)

### బాంకాక్‌లో తిరుగుబాటుదారుల నాయకుని అరెస్టు

బాంకాక్, జూలై 3: తాయిలాండులో రెండు రోజులపాటు నౌకా బలంసాగించిన తిరుగుబాటుకు నాయకత్వం వహించిన వారిలో ఒకరైన లెఫ్టినెంట్ జనరల్ కాక్ సోంగ్రామ్‌ను అయన గృహంలో అరెస్టు చేసినట్లు ఇక్కడ తెలుస్తున్నది.

## గంటల పంచాంగం

ఖర సం॥ జ్యేష్ఠ బ॥ అమావాస్య
1951 సం॥ జూలై 4 బుధవారం
బ॥ అమా॥ ప 1-17 ఆర్ద్ర సా 4-24
వర్జ్యం లేదు.

ఆషాఢ మాసము

శు॥ ప్రథమ జూలై 5 గురువారం
శు॥ ప్రథమ ఉ 8-35 పున సా 7-28
వ॰ రా॰ ఉ 6-1 ల 7-49 కు.


# ఆంధ్రపత్రిక

ఒక్కతేయని యుపేక్షించిన పడిపం,
యుప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవిసేయకునికి పరాయణము
పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ జ్యేష్ఠ బ॥ అమావాస
బుధ వారం


## గ్రాహం కర్తవ్యము

కాశ్మీరుమధ్యవర్తి ఫ్రాంక్ గ్రాహం ముందుగ పాకిస్థాన్ ప్రధాన మంత్రిని, విదేశాంగ మంత్రిని కలుసుకొని భారత ప్రధానమంత్రితో సంప్రతింపులకు వచ్చిరి. ఫ్రాంక్ గ్రాహం మధ్యవర్తిత్వము ఫల ప్రదము కాగలదను నమ్మకము భారత ప్రభుత్వమునకు గాని, కాశ్మీరు సంస్థాన ప్రభుత్వమునకు గాని లేదు. ఫ్రాంక్ గ్రాహం రాయబారములతో భారత ప్రభుత్వము ఎట్టి ప్రసేయము పెట్టుకొన రాదని కాశ్మీరుప్రభుత్వము సూచించి యుండెను. పరిష్కారమునకు ప్రయత్నించుటలో ప్రమాదం లేదుగనుక కాశ్మీరు మధ్యవర్తి ఫలప్రతింపులు ప్రారంభించి యుండవచ్చును.

సమితి మధ్యవర్తి సంప్రతింపులు అసలు కొంతకాల మైనను కొనసాగవలెనని, గత పదునా రోజులుగ పాకిస్థాన్ జరుపుతున్న పరిహాస్యాదాడులు పూర్తిగ నిలిచి పోవలయును. ఈ యుద్ధవిరమణ ఒడంబడిక ఉల్లంఘన ఎంత తీవ్రమైనదో భారత ప్రధానమంత్రి భద్రతా మండలికి తిరిగి మొన్న సోమవారము చేసిన ఫిర్యాదును పరిశీలించిన స్పష్టమగును. గత వారాంతమున భారత సర్వసేనాని జనరల్ కరియప్ప కాశ్మీర్లోని సమితి సైనికాధికారిని కలుసుకొని ఇదే సమస్యను చర్చించిరి. పాకిస్థాన్ యుద్ధ విరమణ ఒడంబడికను ఉల్లంఘించినట్లు సమితిసైనిక ప్రతినిధి అంగీకరించెను. ఈ విషయమై పాకిస్థాన్ సైనిక అధికారులతో సంప్రతింపులను కూడ ప్రారంభించిరి.

భద్రతా మండలి, భారత ప్రభుత్వ ఫిర్యాదును ఎప్పటికి విచారింపకలుగునో తెలియదు. విచారించిన అనంతరము ఎట్టి తీర్మానము చేయునో తెలియదు. రావల్పిండిలో సమితి సైన్యాధికారి జనరల్ నిమ్మో జరుపుచున్న సంప్రతింపులు ఫలప్రదము కాగలవను నమ్మకము కూడ లేదు. కినుక నే భారత సంస్థానముల శాఖా మంత్రి పాకిస్థాన్ నదీ హాస్తము అతిక్రమణలను విరమింప కున్న తిరిగి యుద్ధము ప్రజ్వలించు ప్రమాద మున్నదని హెచ్చరించెను.

ఫ్రాంక్ గ్రాహం అసలు సమస్యను పరిష్కరించుటకు పరిస్థితులు అనుకూలము కావలె నన్న ముందు ఈ సమస్యను పరిష్కరింపవలెను. అందుకు అవసరమైన అధికారము భద్రతా మండలి వీరికి ఇచ్చియే యున్నది. ఆ అధికారమును నావాడ్లు వివియో గించవలో చూడవలసి యున్నది.

## బమంగ్వాటో జాతి వ్యవహారాలు

### బ్రిటిష్ ప్రభుత్వ ఉత్తరువుకు షెకెడీఖామా అంగీకారం

లండన్, జూలై 2: బెచువానా లాండులోని బమంగ్వాటో జాతి మాజీ రాజప్రతినిధి షెకెడీఖామా యీ రోజున బ్రిటిష్ ప్రభుత్వ ఉత్తరువును అంగీకరించారు. బెచువానాలాండుకు తిరిగి వెళ్ళి, తన వాదనను బమంగ్వాటో జాతిప్రతినిధులకు నివేదించ మని బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను ఆదేశించినది.

అయితే, బ్రిటిష్ ప్రభుత్వంసూచించిన పద్ధతి ననుసరించి బమంగ్వాటో జాతినాయకుల సమావేశంలో (సంప్రదాయానుసారంగా జరిగే కగోట్లా) తనవాదన నివేదించడం ఆచరణ సాధ్యమైనది కాదని ఆయన తెలియపరిచారు.

క్రిందటి ఏడాది బమంగ్వాటో జాతి అధినేత సెరెట్సెఖామా ఒక ఇంగ్లీషు బాలికను వివాహం చేసుకొన్నా తరువాత సెరెట్సె, షెకెడీలను బెచువానా లాండునుండి బహిష్కరించడమైనది. షెకెడీ ఖామా బెచువానాలాండుకు తిరిగి వెళ్లడానికి అనుమతించడానికి బ్రిటిష్ ప్రభుత్వం క్రిందటివారం నిరాకరించినది.

బెచువానాలాండుకు తాను తిరిగి వెళ్లడంపై నిర్ణయం తీసుకొనడానికి "కగోట్లా" తగదని షెకెడీఖామా ఈ రోజున పత్రికా విలేఖరులతో చెప్పారు.

## గ్రీసు మంత్రివర్గ రాజీనామా

ఏథెన్సు, జూలై 2: గ్రీసులోని ప్రస్తుత మంత్రివర్గము రెండుపార్టీల ప్రతినిధులుగల సంకీర్ణ మంత్రివర్గముగా నున్నది. ఈ సంకీర్ణ మంత్రివర్గములోని సోషలు డెమోక్రెటిక్ పార్టీకి చెందిన ఉపప్రధాన మంత్రి జార్జి పాపాండ్రూ గారును మరికొందరు మంత్రులును మంత్రివర్గములో నుండి తొలగిపోవుటకు నిశ్చయించిరి. అందువల్ల ప్రస్తుత మంత్రివర్గమంతయు పోదలంచి యున్నదని ప్రధానమంత్రి సోఫోక్లిస్ వెనిజిలాస్ గారు నేడు రాజీనామా కాగితమును గ్రీసు రాజైన పాల్ కు దాఖలుచేసిరి. కాని, పాల్ రాజుగారు యీ రాజీనామాను అంగీకరించలేదు. అన్ని పార్టీలతో కూడిన మంత్రివర్గమును ఏర్పాటు చేయవలె నన్నారు. సోషలు డెమోక్రెటుపార్టీ ప్రతినిధుల రాజీనామాలవల్ల ఏర్పడిన ఖాళీలను ఆరితీ గా భర్తీ చేయవలె నన్నారు.

అన్ని పార్టీల నాయకులను సోఫోక్లిస్ వెనిజిలాస్ గారు సంప్రతింపులకై ఆహ్వానించిరి.

ఈ విధంగా కొత్త మంత్రివర్గమును ఏర్పాటుచేయడం సాధ్యపడక పోతే రాజ్యాంగ విధానమునకు లోబడి తానే కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేస్తానని గ్రీసురాజు అన్నాడు.

## బియ్యంమిల్లు లైసెన్సు ఉత్తరవు

### జిల్లాకలెక్టరులకు బోర్డు సూచన

మదరాసు, జూలై 3: ఏప్రిల్ 19 వ తేదీ నుండి అమలులోకి వచ్చిన బియ్యంమిల్లుల కొత్త లైసెన్సింగ్ ఉత్తరవుయెడ రాష్ట్రంలో మిల్లుల వారు తమ కష్ట నిష్ఠూరములను రాయబారముల ద్వారా తెలుపుకొన్న మీద పరిస్థితి గూర్చి అధికార వర్గాలలో విచారించగా పైలైసెన్సింగ్ ఉత్తరవు విషయమై యీ క్రింది వర్తమానము తెలిసింది. హల్లర్ మిల్లుల వారు కొత్త లైసెన్సులకుగాను రు 24 ఫీజు క్రింద తప్పక యివ్వవలసి యుండును. రివిన్యూబోర్డు వారు తమ ఉత్తరువులో హల్లరు మిల్లుల వారు సెకెటరీ సుకూడా ఏర్పాటు చేయాలని యినుక తాకీదు యిచ్చియుండినను సెపెరేటర్ ఆవే యంత్ర సామగ్రి తయారుగా దొరకని కారణంచేత అట్టి ఏర్పాటును మిల్లులవారు పెట్టాలని జిల్లాకలెక్టరులు కోరకుండా ఉంచుటానికి రివిన్యూబోర్డు అనుమతి నొసగి యున్నదని తెలుస్తోంది. సెక్యూరిటీ మొత్తాలను వసూలుచేసే విషయంలో నయితం పరిస్థితికి తగినట్టుగా చర్య తీసుకొను వచ్చునని కూడా జిల్లా కలెక్టరులకు బోర్డువారు అధికారమిచ్చి నట్లు తెలుస్తోంది.

## అఖిల భారత కమ్యూనిస్టు నాయకుని అరెస్టు

కలకత్తా, జూలై 2: అఖిల భారత కమ్యూనిస్టు విప్లవవాదుల తిరుగుబాట్లు సాగించిన వర్గానికి నాయకుడైన పన్నులాలుదాస్ గుప్తా నేడు కలకత్తాలో సాయుధ పోలీసువద్ద అరెస్టు చేయబడెను. గత 2½ సం॥ నుండీయూ ఆతనిని పట్టుకొనుటకై రెండు గాలు ప్రభుత్వము ప్రయత్నిస్తోంది. ఆతనిని పట్టుకొన్నవారికి రూ 5 వేలు బహుమానం యిస్తామన్నారు. పంజాబులోను ఆస్సాం యిలోను దాయుధాలతో బంది పోట్లు సాగించి ఇంకా అనేక హత్యాకృత్యములు జరిపిన ఆరోపణలున్నవి. ... కలకత్తాలో అనేక ... బోనాగేయుబడెను. ... ఇంటి నుండి ... మూడు సంచుల పాములు బాంబులు ... తొలగించారు.

## 'ఒకే కాన్పులో 12 మంది పిల్లలు కన్న తల్లి'

తాను స్థాపించిన పీపుల్స్ పార్టీలో చేరినవని డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ ప్రకటన.

—శంకర్స్ వీక్లీ.

## నీటి పారుదల, వ్యవసాయ ప్రాజెక్టులకు ప్లానింగ్ కమిషన్ పథకాల్లో అగ్రస్థానం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, జూలై 1: ప్రస్తుత సమస్యలలో అధికాహారోత్పత్తికి, వ్యవసాయాభివృద్ధికి ప్లానింగ్ కమిషన్ విశేషప్రాధాన్యతను ఇస్తున్నట్లు ఎన్నో సూచనలు కనిపిస్తున్నవి. ప్లానింగ్ కమిషన్ నిర్మాణ కార్యక్రమంలో నీటిపారుదల ప్రాజక్టులకూ, వ్యవసాయానికీ అగ్రస్థానం ఇవ్వబడుతుందనీ, మొత్తం పెట్టే ఖర్చులో మూడోవంతు వీటికోసమే ప్రత్యేకించబడుతుందనీ తెలుస్తున్నది.

రవాణా సౌకర్యాల అభివృద్ధికి రెండవస్థానాన్నీ, విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం, కార్మిక శ్రేయస్సు మొదలైన ప్రజోపయోగ కార్యాలకు మూడవస్థానాన్నీ ప్లానింగ్ కమిషన్ తన కార్యక్రమంలో ఇవ్వగలదని తెలుస్తున్నది.

ప్లానింగ్ కమిషన్ ఇప్పుడు తన నివేదిక ముసాయిదాను చర్చిస్తున్నది. కాశ్మీర్ ను వెళ్ళేవరకూ, కమిషన్ అధ్యక్షుడయిన ప్రధాని నెహ్రూ ఈ సమావేశాలకు అధ్యక్షత వహించారు.

నూతన రాజ్యాంగాన్నిపట్టి రహదారి సౌకర్యాలు కేంద్ర బాధ్యతగా పరిణమించటం సర్వ జన శ్రేయో రాజ్యస్థాపన తన ఆశయంగా ప్రభుత్వం భావించటం ఆనే అంశాలు ఆయా కార్యక్రమాలకు ప్రాధాన్యత ఇవ్వటానికి కారణాలయినవి.

దీనినిబట్టి పైకార్యక్రమాలన్నిటికీ ఖర్చు పెట్టగా, పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమానికి మిగిలేది చాలా స్వల్పమే నన్నట్లు కనిపిస్తున్నది. ఈ అంశానికి ప్లానింగు కమిషన్ అన్నిటికన్నా తక్కువ ప్రాముఖ్యను ప్రత్యేకిస్తుందని తెలుస్తున్నది.

### వ్యక్తిగత నిర్వహణకే అవకాశం

కాబట్టి, పారిశ్రామికాభివృద్ధి అన్నది వ్యక్తిగత నిర్వహణ ద్వారా జరగాలని ప్లానింగు కమిషన్ అభిప్రాయపడుతున్నట్లు చెప్పవచ్చును. దేశములో వ్యక్తిగత నిర్వహణకు ప్రోత్సాహం ఇవ్వవలెనని ప్లానింగు కమిషన్ ప్రత్యేక సిఫార్సులు కూడా చేయ వచ్చును.

కాని అంతమాత్రంచేత ప్రభుత్వ యాజమాన్యాన్ని ప్లానింగ్ కమిషన్ ప్రతిఘటిస్తున్నదనికాని, దానిని నిరసిస్తుందనికాని చెప్పటానికి వీలులేదు. దేశానికి తగినంత డబ్బు ఉన్నట్లయితే అనేక ముఖ్యపరిశ్రమలను ప్రభుత్వమే స్థాపించి నిర్వహించవలెనని ప్లానింగ్ కమిషన్ సిఫార్సు చేసి ఉండేదే.

### గోర్వాలా సూచన

ఆర్థిక వేత్త ఎ. డి. గోర్వాలా తన నివేదికలో ప్రభుత్వ యాజమాన్యాన్నే సమర్థించినట్లు తెలుస్తున్నది. ప్రభుత్వ యాజమాన్యంలో ఏమయినా లోపాలు ఉంటే దానికి కారణం నిర్వాహకులకు అనుభవం లేకపోవటం, నిర్వహణ ఏర్పాట్లలో గల లోపాలు, కార్మికుల సహాయ నిరాకరణమైఖరి మాత్రమేనని ఆ నివేదిక సూచిస్తున్నది. ప్రభుత్వ యాజమాన్యాన్ని స్థిరంగా నిట్టుబాటయ్యేట్లుగా చేయటానికి గోర్వాలా కొన్ని సూచనలు చేశారు.

### కార్యక్రమాల్లో ప్రాధాన్యత

నీటి పారుదల ప్రాజెక్టుల కార్యక్రమంలో కొత్తవాటిని ప్రారంభించటంకన్నా, మొదలుపెట్టిన వాటిని ముగించటానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. వ్యవసాయాభివృద్ధిలో అధికాహారోత్పత్తి, జనుము, పత్తిపంటల అభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ఈ సంవత్సరంలో కేంద్ర వ్యవసాయ శాఖవారి కార్యక్రమాన్ని ఆమోదించటం జరగవచ్చును.

రవాణా సౌకర్యాల అభివృద్ధి కార్యక్రమంలో ... స్వయం పోషకత్వం ... లో ఉంటుంది. రైల్వేలు, రోడ్లు, తంతి తపాలా, నౌకాయానం, పౌరవిమాన యానం, రేవులు, బ్రాడ్ కాస్టింగు, దేశంలోపలినీటిదారులు ప్రజోపయోగ కార్యక్రమాల ప్రాధాన్యతలో ఈ వరసలో ఉంటుంది. విద్య, ఆరోగ్యం, కార్మికగృహనిర్మాణం, కార్మిక సదుపాయాలు.

### అంచనాల చిక్కులు

అయితే ప్రాజక్టుల అంచనాలలో ఒక ప్రమాదం ఉన్నది. నిపుణుల అంచనాలు అధికారుల ఆమోదం పొందాలంటే ఎంత తక్కువ అంచనా వేస్తే అంత మంచిదని దామోదర్, సింద్రీ ఎరువుల ఫాక్టరీ మొదలైన వాటి అంచనాలవల్ల తెలుస్తున్నది. కాని ఆ తరువాత మాత్రం ఏదో ఒక నెపంతో దేశంలో యావత్తు ప్రాజక్టు లక్షా అంచనాలు పెంచ బడినవి. ఈ అంచనాలను బయటివారెవరయినా తనిఖీ చేస్తున్నారో లేదో కూడా తెలియదు.

కాని ఈవిధంగా అంచనాలు పెరగటం మాత్రం చాల ప్రమాదకరం. ఉదాహరణకు 3 సం॥ వ్యవధిలో నీటి పారుదల ప్రాజక్టుల అంచనాలు రెండింతలు పెరిగిపోతే ఇంకా ప్రజోపయోగ కార్యక్రమాలకు డబ్బు లేకుండా పోవచ్చును.

### ధరల నిలకడ

ప్లానింగులో మరొక ముఖ్య విషయం ధరలనిలకడ. అంచనాలన్నీ ప్రస్తుతం వున్న ధరలను బట్టి వేయబడ్డవి. ధరలను ప్రస్తుతం వున్న స్థాయిని దాటిపోకుండా నిలిపి వుంచటానికి ప్రభుత్వం ప్రూమకోక పోతే కార్యక్రమం యావత్తూ తలక్రిందులయిపోగలదు.

ప్లానింగుకు మరొక అవసరం ప్రభుత్వసిబ్బంది. పద్ధతివారీగా అభివృద్ధి చెయవలెనంటే కంట్రోల్లు ఉండక ప్పదు. కాని వాటివల్ల అవినీతి పెరగటంవల్ల వాటిపట్ల విముఖత బయలు దేరినది. కార్యక్రమాన్ని నిర్వహించటానికి సమర్థులు, క్రమశిక్షణ గలవారిని ఏర్పాటుచేయకపోతే, అసలు ప్లానింగే నిరుపయోగం అవుతుంది. ఈ విషయమై గోర్వాలాచేసిన సూచనలు ప్రభుత్వానికి చాలా తోడ్పడగలవు.

## నీటి సదుపాయాలు

### సంపూర్ణంగా ఉపయోగించుకొనవలసిన ఆవశ్యకత

ఇరిగేషను పరిశోధన సంస్థలో ప్రముఖుల ఉద్బోధలు

సిమ్లా, జూలై 2: మన ప్రజల జీవిత ప్రమాణమును హెచ్చించుట మన కర్తవ్యములలో అతి ప్రధానమైనది. ఈ కర్తవ్యమును మనము నెరవేర్చవలెనన్న మనగొప్ప ఇరిగేషను, హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులను త్వరలో పూర్తిచేయవలసి యున్నది." అని పంజాబు గవర్నరు చందులాల్ త్రివేదిగారు కేంద్ర ఇరిగేషను బోర్డు పరిశోధన సంఘ 21 వ వార్షిక సభను ప్రారంభిస్తూ చెప్పారు.

వివిధ రాష్ట్రముల ఇంజనీరులు, పరిశోధకులు, మాత్రమే గాక, సమితి విద్యా విజ్ఞాన శాస్త్రీయ సంస్థ ప్రతినిధులు, సైన్సు కో ఆపరేటివ్ ఆఫీసు ప్రతినిధులు ఈ సభకు హాజరైనారు.

పథకాలు వేసి నిర్వహించటంలో పరిశోధనలు, చేసేవారికి ఇంజనీర్లకు, పరిపాలనాధికారులకు సహకార భావము అత్యావశ్యకమని శ్రీ త్రివేదీగారు ఉద్బోధించారు.

భారత ప్రభుత్వ కన్సల్టింగ్ ఇంజనీరు శ్రీ ఏ. ఎన్. ఖోస్లాగారు అధ్యక్షోపన్యాసము గావిస్తూ ఇప్పుడు ప్రజల సంపాదన ప్రాణాలను నిలవ పెట్టుకొనుటకు మాత్రమే సరిపోతున్నది, ప్రజల జీవిత ప్రమాణాన్ని హెచ్చించి వారికి సుఖజీవనం కలిగించడానికి విశేషమైన కృషి జరగా ల్సి వున్నదని చెప్పారు." మనకున్న నీటి సదుపాయాలలో 100 కి 6 వంతులను మాత్రమే మనము పొలాలను సాగుచేయడానికి ఉపయోగించుకొన్నాము. మనకున్న నీటినుండి ఎంత విద్యుచ్ఛక్తి యైనా ఉత్పత్తి చేసి కొనవచ్చు. కాని మనము యింతవరకుఉత్పత్తిచేసికొన్న విద్యుచ్ఛక్తి బహు స్వల్పము. ఒకటి రెండు పెద్ద నదులలో మాత్రమే యిప్పుడు నావలు నడవడానికి వీలవుతున్నది. దేశమునందలి జలదారులను నౌకాయానానికి వుపయోగించుకునే అవకాశము ఎంతేని కలదు. ఈ నీటి సదుపాయాలన్నిటినీ మనము పూర్తిగా వుపయోగించుకోవలెనంటే విరివిగా పరిశోధనలు చేయాడం అవసరము. పరిశోధన బాగాజరిగినప్పుడే మనఅభివృద్ధి కార్యక్రమాల నన్నిటినీ మనము సమర్థంగా, శీఘ్రంగా, తక్కువఖర్చులో నిర్వహించుకొన గలిగెదము. ఇప్పుడు భారతదేశంలో 135 ప్రాజెక్టులు నిర్మాణములో వున్నవి. వీటిఖర్చు అంచనా 590 కోట్ల రూపాయలు. వీటిలో ముఖ్యమైనవి పంజాబునందలి భాక్రా-నంగల్ ప్రాజెక్టు, బెంగాలు బీహారుల యందలి దామోదరవ్యాలీ ప్రాజెక్టు, ఒరిస్సాయందలి హీరాకుడ్ ప్రాజెక్టు, మద్రాసు హైదరాబాదుల యందలి తుంగభద్ర ప్రాజెక్టు, మద్రాసులోని లోయర్ భవాని ప్రాజెక్టు, బొంబాయి యందలి కక్రపారా ప్రాజెక్టు బెంగాలునందలి మైూ ప్రాజెక్టు.

ఈప్రాజెక్టులలో ప్రతిదానికి తేదైన్న, సమస్యలను, నిర్మాణ సమస్యలను పరిష్కరించడానికి పెద్ద పరిశోధనాలయాలు కావలె" అని శ్రీ ఖోస్లా గారు చెప్పారు.

## ప్రాగ్ లో అమెరికన్ విలేఖరి గూఢచారి చర్యలు

ప్రాంక్ ఫర్ట్, జూలై 2: న్యూయార్కు, లండన్ నగరాలలో ఉన్న తన పైఅధికారుల ఆదేశాలపై గూఢచారిగా పని చేసినట్లు ప్రాగ్ లోని అమెరికా అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరి విలియమ్ ఈరోజున న్యాయస్థానంలో అంగీకరించినట్లు ఇక్కడి అమెరికన్ వర్గాలవారు చెబుతున్నారు.

ఏప్రిల్ 3 వ తేది చెకొస్లొవాకియా గూఢచారి శాఖాధికారులు ఓటిస్ ను అరెస్టు చేశారు. చెకొస్లొవాకియా భద్రత దృష్ట్యా బహిరంగ పరచకూడని రాజకీయ ఆర్థిక సైనిక రహస్యాలను సేకరించినట్లు ఆయన అంగీకరించారు.

న్యాయస్థానంలో పశ్చిమ దేశాల పత్రికావిలేఖరులు ఎవరూలేరు. కాని, ప్రాగ్ లోని అమెరికన్ రాయబార కార్యాలయానికి చెందిన ఇరువురు పరిశీలకులు మాత్రం న్యాయస్థానంలో ఉన్నారు.

అమెరికన్ రాయబార కార్యాలయంలో చారాముందిగూఢచారి శాఖాధికారులు ఉన్నారని చెబుతూఆయన వారి పేర్లను కూడా ప్రకటించారు.

ఈ గూఢచారి చర్యలలో రాయిటరు విలేఖరి, అమెరికా యునైటెడ్ ప్రెస్ విలేఖరి, ఫ్రెంచి వార్తా సంస్థ విలేఖరి కూడా పాల్గొన్నారని కూడా ప్రాసిక్యూషను ఆరోపణ చేసినది.

## ఆర్థిక దుర్బల రాజ్యాలకు సమితి సహాయం

అయిక్యరాజ్య సమితి న్యూయార్కు, జూలై 2: ఇండియా, పాకిస్థాను, సింహళమున్నూ మధ్యప్రాచ్యంలోని ఆఫ్ఘనిస్తాను, యీజిప్టు, పర్షియా, ఇరాకు, ఇశ్రాయేలు, జోర్డాను లెబనాను లిబియా, సోమాలీలాండు, సిరియా, టర్కీ, యెమెను రాజ్యాలున్నూ మొత్తం 65 రాజ్యాలున్నూ ప్రాంతాలున్నూ 1950 జూను మొదలు 1951 మే వరకు అయిక్యరాజ్య సమితివల్ల శాస్త్రనిపుణుల సాంకేతిక సహాయమును ఎంతవరకు పొందెనో వివరించెడి నివేదిక గత వారాంతమందు సమితి ప్రధాన కార్యదర్శి యగు ట్రిగ్వీలీగారిచే ప్రకటింపబడెను. అమెరికా ప్రెసిడెంటయిన ట్రూమను తన సంకల్ప ప్రణాళికలోని నాల్గవ అంశముగా ఆర్థిక దుర్బల రాజ్యాలకు శాస్త్ర నిపుణాల సహాయము నొసంగుటకు నిర్ణయించెను. సమితి చేసెడి సహాయమునకు ప్రెసిడెంటు ట్రూమన్ చేసే సహాయము అనుబంధముగా ఉన్నది.

## ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ

### ఆగస్టు 15 న బాపట్లలో జరుపుటకు గుంటూరుజిల్లా కాంగ్రెస్ నిర్ణయం

ఆహ్వానసంఘం యేర్పాటు

తెనాలి, జులై 1: ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభను, ఆగస్టు 15 వ తేదీన బాపట్లలో జరుపుటకున్నూ, సదరు మహాసభకు అధ్యక్షులుగా ఆ. భా. కాంగ్రెస్ కార్యదర్శియైన కళావెంకట్రావుగారిని, ప్రారంభకులుగా బాబు పురుషోత్తమదాస్ టాండన్ గారి, పతాకోత్సవను జరుపుటకు బెజవాడ గోపాలరెడ్డిగారిని ఆహ్వానించుటకును గుంటూరుజిల్లా కాంగ్రెస్ సంఘం, నిన్న మధ్యాహ్నం మంతెన వారి మేడలో జరిగిన సర్వసభ్య సమావేశమందు తీర్మానించు కొన్నది.

జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు ఆలపాటి వెంకట్రామయ్యగారు అధ్యక్షత వహించిన యీసమావేశానికి 60 మంది సభ్యులు హాజరైనారు. రాష్ట్ర రాజకీయ మహాసభ జేడీని నిర్ణయించిన పిదప, ఆహ్వాన సంఘాన్ని ఎన్నుకొన్నారు. ఇందు ఆలపాటి వెంకట్రామయ్య (అధ్యక్షుడు) ఆరె నీరారెడ్డి (కార్యదర్శి) జి. నారాయణ (కోశాధికారి) మంతెన వెంకటరాజు ఎం. ఎల్. ఎ. అనరాపురపు శేషగిరి రావు, ముప్పలనేని మాణిక్యాలరావు, కొల్లా వెంకటేశ్వర్లు, గోరంట్ల రామయ్య, కొండా నారపరెడ్డి వూటుకూరి రామయ్య, రావుల హరి ప్రసాదరావు, అన్నదాత నాగేంద్రుడు, నూతలపాటి జోసెఫ్ గారలు సభ్యులు. మరికొందరిని కూడా సభ్యులుగా చేర్చుకొనుటకు ఆహ్వాన సంఘానికి అధికార మీయబడింది. అన్ని జిల్లాకాంగ్రెస్ సంఘాలు, రాజకీయ మహాసభ అధ్యక్షులుగా కళావెంకట్రావుగారిని ఎన్నుకొని తెనాలిలోని ఆహ్వానసంఘ కార్యాలయానికి తెలుపవలసిందిగా కోరుటకు అధ్యక్షులు నిర్ణయించారు.

### జిల్లాలో కాంగ్రెస్ ప్రచారానికి 25 వేల రూ. లు మంజూరు

వచ్చే జనరల్ ఎన్నికలలో కాంగ్రెస్ ప్రచారం నిమిత్తం డబ్బు వసూలు చేయుటకు ఆలపాటి వెంకటరామయ్యగారు అధ్యక్షులుగా, ఆర్. వీరారెడ్డిగారు కార్యదర్శిగా, మంతెన వెంకటరాజు, కాసు బ్రహ్మానందరెడ్డి, వేమూరు నాగేశ్వరరావు, మద్ది సుదర్శనంగారలు సభ్యులుగా ఒక ఉపసంఘం ఎన్నుకోబడినది. ప్రస్తుతం 60 వేల రూ. ల వరకూ వసూలు చేయబడినవి. జిల్లా కాంగ్రెసు తరఫున ప్రచారం సాగించే నిమిత్తం రెండు మోటారు వాన్ లను, రెండు శబ్ద విస్తరణ యంత్రాలను కొనుటకు, జిల్లా కాంగ్రెసు నిధి నుండి 25 వేల రూ. లు మంజూరు చేస్తూ తీర్మానించడమైనది.

25-5-49 నుండి 30-12-50 వరకు జరిగిన ఆడిటేరి పోస్టున్నూ 30-12-50 నుండి 30-6-51 వరకు జిల్లా కాంగ్రెసు కార్యవర్గం వారు తయారుచేసిన ఆదాయ వ్యయములను ఆమోదించడమైనది. (స్వ. వి.)

### బద్వేలుకు సంజీవ రెడ్డిగారిరాక

బద్వేలు, జూన్ 30: నిన్న సాయంకాలం యిక్కడకు వచ్చిన ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు నీలం సంజీవ రెడ్డిగారిని సన్మానింప బోర్డు హైస్కూలు ఆవరణలో కడపజిల్లా బోర్డు ప్రెసిడెంటు టి. పుల్లారెడ్డిగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. ఈ తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు బి. రామారెడ్డిగారు సభను ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సహాయ కార్యదర్శి చెంగల్వరాయ నాయుడుగారు ఆహ్వాన సంఘమువారి తరఫున సంజీవ రెడ్డిగారిని సభికులకు పరిచయం చేశారు. దేశాన్ని ఆహార పదార్థాల విషయంలోనూ, వస్త్రోత్పత్తి విషయంలోనూ స్వయం సమృద్ధం చేయటానికి ప్రభుత్వం చేస్తున్న కృషిని సంజీవరెడ్డిగారు వివరించారు. ప్రభుత్వంవారి ప్రయత్నాలన్నీ ఫలించేటంత వరకు ప్రజలు ఓర్పుతో నుండి వీలైనన్ని విధాల ప్రభుత్వంతో సహకరించాలని అన్నారు. బి. రామారెడ్డి; నీలకంఠంగార్లు, స్థానిక సేవాసంఘం వారు, హరిజనులు రెడ్డిగారికి విన్నపాలు అందచేశారు. వీరుకోరిన పనుల విషయంలో తను సహాయం చేయగలనని రెడ్డిగారు హామీ యిచ్చారు.

### కడపలో సంజీవరెడ్డిగారి ప్రసంగం

కడప, జూలై 3: నిన్న సాయంకాలం ఇక్కడ జరిగిన బహిరంగ సభలో ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డిగారు నిర్దిష్టమైన నిర్మాణకల సంస్థ కాంగ్రెసు ఒక్కటే నన్నారు. అన్ని రంగాలలోనూ కాంగ్రెసు ప్రభుత్వాలు అభివృద్ధిని చేకూర్చాయనీ, యింకా ఏ కొంచెమైనా లోపాలు కనుపిస్తే అవి కూడా వచ్చే 6 ఏళ్ళలో తీరిపోగలవనే ఆశాభావాన్ని వెలిబుచ్చారు. అనుభవజ్ఞులైన వారితో ఏర్పడ్డ ప్లానింగు కమిషన్ వారు అభివృద్ధికి అవకాశాలన్నిటినీ పరిశీలిస్తున్నారనీ, ఇప్పుడు వ్యవధి చాలక నిలచిపోయిన్న అభివృద్ధి కార్యక్రమమంతా ప్లానింగ కమిషన్ వారి నివేదికను అనుసరించి జరుగుటంతో ఆచరణలోనికి రాగలదనీ చెప్పారు.

## సమితిసేనాని సమ్మతి

(1-వ పేజీ తరువాయి)

మార్షల్ ఈ వేళ యిక్కడ దిగువసభ విదేశవ్యవహారాల కమిటీ సమావేశంలో ప్రసంగిస్తూ అన్నాడు.

అమెరికా తన మిత్రదేశాలకు 8500 మిలియన్ల డాలర్ల ఆర్థిక సైనిక సహాయం చేయాలన్న ప్రభుత్వ ప్రతిపాదనమీద మాట్లాడుతూ ఆయన ఈ విషయాన్ని వెల్లడించాడు.

"చైనా అంతర్యుద్ధం రోజుల్లో జాతీయ వాదులు లాగా కమ్యూనిస్టులూ యుద్ధవిరమణ ఒడంబడిక చేసుకోటం కమ్యూనిస్టులకు లాభకరం అయింది; కాని కొరియా విషయం అట్లా కాదు; యిక్కడ కమ్యూనిస్టులు వేసుకున్న పథకాలన్నీ విఫలమైపోయాయి. ఆ యుద్ధాన్ని సర్దుబాటు చేసుకోవటం ఎలాగా అన్నదే యిప్పుడు వారికి పట్టుకున్న సమస్య."

యూరప్ కు అమెరికా 6 పటాలాల కంటె (డివిజన్లు) ఎక్కువసైన్యం పంపించ గోరటం లేదనీ, యుద్ధం అంటూ వస్తే అప్పటి సంగతి అప్పుడు ఆలోచించుకోవచ్చుననీ మార్షల్ అన్నాడు.

1950 లోను 54 లోను కూడా అమెరికా విదేశాలకు ఇప్పటివలె సరిగా నే సహాయం చేయవలసి వుంటుందనీ, 55 నుంచి యూరోపియ రాజ్యాలు స్వయంపోషకం కాగలవని ఆశిస్తున్నామని మార్షల్ వివరించాడు. అమెరికాలోను అమెరికా మిత్రదేశాలలోను ఆయుధాలను నీలైనంత వరకు ఒకే ప్రమాణాన్ని పట్టి తయారు చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనీ, కాని ఈ ప్రమాణీకరణ ప్రక్రియ తగినంత చురుకుగా సాగటం లేదనీ ఆయన అన్నాడు.

## బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి ప్రకటన

లండన్, జులై 2: కమ్యూనిస్టుల ఎదురుప్రతిపాదనకు అంగీకారం సూచిస్తూ ఐక్యరాజ్య సమితి సర్వసేనాని జనరల్ రిడ్జ్వే త్వరలో నే వారికి జవాబు పంపగలడని విదేశాంగ మంత్రి హెర్బర్టు మారిజన్ పార్లమెంటులో ఈవేళ ప్రకటించాడు.

"జనరల్ రిడ్జ్వే సందేశానికి కమ్యూనిస్టుల ప్రత్యుత్తరానికి వస్తుతః అట్టే తేడా లేదు.

యుద్ధవిరమణ విషయమై సంప్రదింపులు జరిగేటప్పుడు, నిర్బంధితులైన సైనికులను పౌరులను పరస్పరం అప్పగించే విషయమైకూడా ఒప్పందం కుదుర్చుకోగలరని ఆశిస్తున్నాను.

యుద్ధవిరమణ ఒడంబడిక కుదరటమేకాక తద్వారా కొరియాకు సంబంధించిన రాజకీయ సమస్యలను చర్చించటానికి దారి ఏర్పడగలదని బ్రిటిషుప్రభుత్వం ఆశిస్తోంది.

యుద్ధవిరమణ ఒడంబడిక షరతుల గురించి అనవసరమైన ఊహాగానం చెయ్యటం లేదా బహిరంగ చర్చ జరపటం మంచిది కాదని నా అభిప్రాయం."

## బ్రిటిష్ మంత్రివర్గ సమావేశం

లండన్, జూలై 2: బ్రిటిష్ మంత్రివర్గం ఈవేళ ప్రొద్దున ప్రధానమంత్రి అట్లీ అధ్యక్షత వహించగా సమావేశమై జనరల్ రిడ్జ్వే సందేశానికి కమ్యూనిస్టులు పంపిన ప్రత్యుత్తరం గురించి చర్చించింది. ఈ సమావేశంలో ఇరాన్ పెట్రోలు సమస్యగురించి కూడా చర్చ జరిగినది.

### కొరియాలోకి మరో చైనా పటాలం ప్రవేశం?

టోకియో, జులై 3: 70 వేల బలం గల ఒక కొత్త కమ్యూనిస్టు పటాలం మంచూరియానుంచి సేవూల్ కు పశ్చిమోత్తరంగావున్న ఒక ప్రాంతానికి కదిలి వచ్చినట్లు తెలుస్తున్నది. అయితే ఈ వార్త యింకా ధ్రువపడలేదు.

## కొరియా యుద్ధం

కొరియా, జులై 2: కొరియాలో యుద్ధం సమసిపోతున్న సూచనలేమీ ఇంకా కన్పించటంలేదు. చిన్న ఎత్తున సంఘర్షణలు ఇప్పటికీ జరుగుతూ నే వున్నవి.

నిన్న రాత్రి పగలూ మధ్యరంగంలో కమ్యూనిస్టులు ఎడతెగకుండా దాడ్లు జరిపారనీ, కాని ఈ దాడ్లనన్నిటినీ ఐక్యరాజ్య సైన్యాలు తిరుగగొట్టాయనీ, ప్యాంగ్యాంగ్ కు దక్షిణంగా ఐక్యరాజ్య సైన్యాలకు కమ్యూనిస్టులకు సంఘర్షణ జరిగిందనీ, యీ వేళ ఐక్యరాజ్య సైనికాధికారులు ప్రకటించారు. ఉత్తర కొరియా మీద విమానదాడ్లు యథాప్రకారం జరుగుతూ నే వున్నాయి.

కమ్యూనిస్టులు యుద్ధ విరమణ సంప్రతింపులకు సమావేశ స్థలంగా ప్రతిపాదించిన కేసంగ్ ప్రాంతంలో సంఘర్షణలు అట్టే జరగలేదు.

తూర్పు కోస్తాన వోన్సాన్ సోంగ్జిన్ రేవులపై ఐక్యరాజ్య నౌకాదళాలు నిర్విరామంగా శతఘ్ని కాల్పులు సాగిస్తున్నాయి. వోన్సాన్ ప్రాంతంలో 20 వాహనాలు 11 కట్టడాలు ధ్వంసమైనట్లు ప్రకటించబడింది.

వివిధ రంగాలలోను ఈవేళ యుద్ధం మళ్ళీ తీవ్రంగా ప్రజ్వలించింది.

కమ్యూనిస్టులు శతఘ్నులను ఎడతెగకుండా కాలుస్తూవుంటే ఐక్యరాజ్యవిమానాలు శత్రు స్థావరాలపై భారాపాతంగా బాంబులు కురిపిస్తున్నారు.

... ఉత్తరాన కమ్యూనిస్టులు ఐక్యరాజ్య సైన్యాలను తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు.

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 3.

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు నవరను 1-కి ఎడ్వర్డుతొమ్మ సేల్సుటాక్సుతోవహా రు. 79.0.0 పెట్టుబంగారు తులం 113.10.0 మూస బంగారు 111.0.0 సీసువెండి తులం 100-5 (రెడి) 190.0.0 వెండి తులం 1.8 2.0.0

వేరుశెనగ: (531 పా 1-కి ఎక్సుకోసా గిడ్డంగుల డెలివరీ - సేల్సుటాక్సుతో వహా) కొత్తది.

| | |
|---|---|
| కారమండల్ | 215-0-0 |
| కడలి | 220-0-0 |
| వేపనూనె సెప్టెంబర్ వరకు 3½ | |
| నాసిక్ (500 పా) | రు. 430-0 |
| కొబ్బరి నూనె (37½ పాలులుగం డబ్బా ఒకటి | |
| క్వైలాన్ (ఎమ్. ఎస్. బ్రాండ్) | రు. 40-8-9 |
| కాలికట్ | రు. 40-6-9. |

ఆముదం

| | |
|---|---|
| 500 పౌనుల గం దారప ఒకటికి "ఐమస్టార్" | రు. 530-0-0 |

చంద దార

| | |
|---|---|
| "నరసారావుపేట" | రు. 550-0-0 |
| పాలి ("ఐ ల్లయు") | రు. 102-0-2 |



## ప్రకటన

బొబ్బిలిలో (శ్రీకాకుళం జిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్రవారపత్రిక, భారతి మాసపత్రికలను వారి స్వబాధ్యతపై విక్రయించుటకు శ్రీ సి. రామమోహనరావుగారి స్థానే శ్రీ తెర్లా శ్రీ ముప్పల గోపాలరావుగారిని 1—7—1951 నుండి నియమించడమైనది.

మేనేజరు,
ఆంధ్రపత్రిక.

## సదరన్ రైల్వే.

### టెండరు నోటీసు

ఈ రైల్వేలో డిపార్టుమెంటలుగా నడుపబడుచున్న దిగువ గ్రూపుల శాకాహార ఫలాహారశాలలకు 1951-వ సం॥ ఆగస్టునుండి ఒక సంవత్సరము పిచులేకుండ, మంచిరకము పెద్దసైజు కొబ్బరికాయలను సప్లయిచేయుటకు సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి. ఆ యా ఫలాహారశాలలవద్ద కళాసైకాయింట్లను ఉచితముగా డెలివరీ చేయవలెను.

| I గ్రూపు | | II గ్రూపు | | III గ్రూపు | |
|---|---|---|---|---|---|
| ఆర్కోణం | (750) | నూడూరు | (625) | గుంతకల్లు | (1700) |
| కాట్పాడి | (500) | ఒంగోలు | (650) | హుబ్లి | (1200) |
| జాలార్పేట | (500) | తెనాలి | (350) | | |
| బంగారపేట | (350) | గుంటూరు | (500) | | |
| పాకాల | (125) | బెజవాడ | (1500) | | |
| రేణిగుంట | (450) | నిడదవోలు | (200) | | |
| కడప | (800) | సామర్లకోట | (450) | | |
| రాయచూరు | (400) | | | | |

ఒక్కొక్క ఫలాహారశాలకు రోజుకు (బ్రాకెట్లలో అవసరమైన కావలసిన సెలసరి సుమారు సంఖ్య తెలుపబడినది)

టెండర్లు ఒక్కొక్క గ్రూపుకు విడివిడిగా నిర్ణీత ఫారములో పంపవలెను. ఒక్కొక్క టెండరు ఫారము ఖరీదు రు 5/-లు. ఈ సొమ్ము మద్రాసు పార్కుటౌనులో ఈ రైల్వే పే-మాస్టరు అండ్ కాషియరుకు చెల్లించవలెను. టెండరు ఫారములు ఒకరివి మరియొకరికి మార్చుకొనగూడదు. వాటి ఖరీదు వాపసు చేయబడదు. ఈ రైల్వే పే-మాస్టరు అండ్ కాషియరు వల్ల జారీచేయబడు రు 5/-ల అఫీషియల్ రశీదును చూపినచే టెండరుఫారము సప్లయిచేయబడును.

టెండరుదారు, టెండరుతోపాటు నిర్ణీతమైన ప్రొఫార్మాలో ఆదాయపుపన్ను ఇన్‌కంటాక్సు క్లియరెన్సు సర్టిఫికేటు దాఖలు చేయవలెను. ఇన్‌కంటాక్సు క్లియరెన్సు సర్టిఫికేట్లు లేకుండ పంపబడు ఏ టెండరైనను నిరాకరింపబడును.

తక్కువ టెండరును గాని ఏ టెండరును గాని పూర్తిగా గాని కొంత భాగము గాని అంగీకరింపవలసిన బాధ్యత రైల్వేవారికి లేదు. ఒక గ్రూపులో ఒకరికి గాని అంతకంటె ఎక్కువమంది కంట్రాక్టర్లకు గాని కంట్రాక్టులు యిచ్చుటకు రైల్వేవారికి అధికారము కలదు.

టెండరుఫారములు 13-7-51 తేది సా॥ 3 గంటలకు పైబడి జారీచేయబడవు.

టెండర్లు 25-7-51 తేదీ సా॥ 3 గంటలవరకుమాత్రమే తీసుకొనబడును.

మదరాసు, 
　-6-51.　　　కే. ఎల్. [illegible]
　　　　　　చీఫ్ కమర్షియల్ [illegible]



# మద్రాసు వార్తలు

## అమెరికా పట్టభద్రుల సంఘం

మదరాసు, జూలై 3: ద. ఇండియాలోనున్న అమెరికా విశ్వవిద్యాలయాల పట్టభద్రుల సంఘం మదరాసులో రేపు స్థాపింపబడునని శ్రీ మాగంటి బాపినీడుగారు తెల్పుచున్నారు. రేపు సా. 4 గ.లకు మెరినా కాంటీనులో శ్రీ బె. గోపాలరెడ్డిగారు, ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రొ॥ చాన్సలర్ ప్రారంభోత్సవం జరిపెదరు. అమెరికాకు విద్యాశిక్షణకై వచ్చిన వారంతా యీ సంఘంలో చేరవచ్చును.

## వయోజన విద్యాప్రచారం

మదరాసు రాష్ట్రమునందు వయోజన విద్యా ప్రచారంకొరకు కొన్ని లక్షలు యింతవరకు ఖర్చయినది. ఈ పని స్థానిక సంస్థలు ప్రయివేటు సంఘాలద్వారా జరుగుచున్నది. ఎంత ఖర్చయినదో ఎంత పని జరిగినదో వివరాలు యింతవరకు తెలియలేదు. కనుక ప్రభుత్వం విద్యా శాఖవారు వివిధ సంస్థలకు ప్రశ్నావళి పంపేరు. దానికి జవాబులు నెమ్మదిగా వస్తున్నవి. ఇంతవరకు జరిగిన పనిగూర్చి ఇకముందు జరుగవలసిన పద్ధతిగూర్చి, చర్చించుటకు, ద. ఇ. వయోజన విద్యా సంఘ కార్యదర్శి అయిన గా॥ గోఖలే స్టోరియాగారు సోమవారం విద్యాశాఖ కార్యదర్శి యునితన్ గారితో చర్చించేరు. జవాబులన్నీ వచ్చి, సంఖ్యలు తెలిసినాక ముందు కర్తవ్యం నిర్ణయించుటకు నిశ్చయించేరు.

## 6 వ తేదీ పోస్టు టెలిగ్రాఫ్ సెలవు

ఇనుపండుగ సందర్భమున జూలై 6 వ తేదీ పోస్టు, టెలిగ్రాఫ్ కార్యాలయముల సెలవుదినం. ఆనాడు ఆదివారంవలె పని జరుగును.

తమిళ నాడు ప్రజాపార్టీ కన్వెంషను 4 తే సా. 5 గ. నెం. 9 బ్రాడ్వేలో జరుగును.

## చక్కెర రేషనింగు

దన్న రాష్ట్రంలో చక్కెర కావలసిన దానిలో సగం ఉత్పత్తియగుచున్నదనియు, యిపుడున్నట్లు సప్లయి యికముందుకూడ జరిగినచో చక్కెర రేషనింగు తొలగింప వీలుండునని ఆహార శాఖమంత్రి రోషు విక్టోరియాగారు చెప్పేరు.

## ప్రత్తి కంట్రోలు

విస్తరణ రకం ప్రత్తి జులయి 31 లోగాను, కంబోడియా, కరుంగన్ని రకములు ప్రత్తి ఆగస్టు 31 లోగాను గింజతీసేసి యుంచాలని టెక్స్టయిలు కమిషనరు ప్రకటించి యుండిరి. ఆ తేదీల తరువాత ఆ రకముల ప్రత్తికలిగి యుండుట నేరమగును. సరకున్నవారు ఎంత సరకున్నదీ కంట్రోల్సు డైరక్టరు గారికి 12-7-51 తే. లోగా తెలుపాలి.

మదరాసునగరంలో సభలు ఊరేగింపులు ఉత్సవాలు లైసెన్సు పొందనిది జరుపరాదను ఉత్తరువు కాలపరిమితి 1951 ఆగస్టు 31 వరకు పొడిగించేరు.

ప్రభుత్వ స్త్రీల శ్రేయోభివృద్ధి శాఖవారు ఆయపురంలో నిర్వహించుచున్న సర్విసుహోము వార్షికోత్సవమునందు అధ్యక్షత వహించిన గా॥ గోపాలరెడ్డిగారు, శిక్షణపొందిన స్త్రీలు సంఘసేవా కార్యాలు చేయుటకు ఎంతమందైనా అవసరమని చెప్పి, యీ శాఖ చేస్తున్న కృషిని కొనియాడేరు. స్త్రీలశాఖ డైరక్టరు శ్రీ జాతం నాయుడుగారు స్వాగత మిచ్చిరి. స్త్రీలు చేసినపనులు వస్తువుల ప్రదర్శనం తెరువబడెను. విద్యార్థినులు హిందీ నాటకం, నృత్యం ప్రదర్శించేరు. సరోజిని వరదప్పను గారు వందనము లర్పించుటతో సభ ముగిసింది.

## మదరాసుకు అదనం బియ్యం

మదరాసు, జులై 2: మదరాసు రాష్ట్రానికి ఇండియా ప్రభుత్వంవారు కేటాయించిన 10 లక్షల టన్నుల ఆహార ధాన్యాలలో కనీసం 4 లక్షల టన్నులు బియ్యమయినా పంపాలని రాష్ట్రప్రభుత్వం ఇండియా ప్రభుత్వాన్ని కోరినది. మొదట మొత్తం 4 లక్షల టన్నులే యిస్తామన్నపుడు అందు బియ్యం 2 ల॥ టన్నులుంచు నన్నారు. 3 టన్నుల లేదను సంవత్సరం అంతా యిచ్చుటకు కనీసం మరో 2 లక్షల టన్నులైనా బియ్యం యివ్వాలని కోరినట్లు, ఆహార శాఖ మంత్రి రోషు విక్టోరియాగారు నేడు విలేఖరులకు తెలిపిరి. ఇండియా ప్రభుత్వము బియ్యంకోటా పెంచే అవకాశం లేకపోలేదని వారన్నారు.

నినవరంలో పందరేశ చాయను (54) తన కుమారులు తనను విడిచినందున ఉరిపోసుకొని చనిపోయెను. కారణం ఒక లేఖ రూపంలో తెలియ చేసెను.

## ఉద్యోగవార్తలు

మదరాసు, జులై 2: శ్రీకాకుళం జిల్లా కలెక్టరు జనాబ్ షేక్ అహమ్మద్ ఐ. ఎ. యస్. కు జులై 16 నుండి 2 నెలలు శలవు మంజూరు చేశారు.

కాకినాడ ఇంజనీరింగ్ కాలేజి వర్కుషాపు ఇన్‌స్ట్రక్టరు శ్రీ [illegible] [illegible] [illegible] అసిస్టెంటు అగ్రికల్చరల్ ఇంజనీరుగా నియమించారు.

# రాష్ట్రంలో వన మహోత్సవాలు

కడప, జూలై 1: నేటిపుదయం కలెక్టరుగారి కార్యాలయంలో మేళతాళాలతో వనమహోత్సవం ఆరంభమైంది. వనమహోత్సవాల ఆదర్శాన్ని గూర్చి జిల్లా కలెక్టరు ఎస్. ఎస్. ఖురైషీగారు ఉపన్యసించారు. చెట్లు నాటటానికి ప్రయత్నించకుండా మనకు వున్న అవసరాలనిమిత్తం అడవులను నరికొట్టి చేశానికి ఎంతటి నష్టం వాటిల్లేదీ జిల్లా వ్యవసాయ శాఖాధికారి జీవనరావుగారు వివరించారు. కలెక్టరు, జిల్లాజడ్జి కొనుగ మొక్కలు నాటారు.

నిన్న కలెక్టరుగారి కార్యాలయంలో జరిగిన సమావేశంలో, నిరుడు నాటిన 1,18,929 మొక్కలలో యీ రోజున బతికివున్న వానిసంఖ్య 27,336 అయినట్లు కలెక్టరుగారిద్వారా శాసూర్యాల్ (ఎం. ఎల్. ఎ.) గారు తెలుసుకొన్నారు.

### రాయచోటి

ఇక్కడ పార్లమెంటు సభ్యుడు నంగా నరశివగారు యీ 1 న వనమహోత్సవం ప్రారంభించారు. పంచాయతీ బోర్డు అధ్యక్షుడు సయ్యద్ సాహెబ్, డా॥ తిప్పారెడ్డిగార్లు పలు వృక్షాలను నాటారు. ఉదయం బాలబాలికలతో వూరేగింపు జరిగింది.

### పెనుకొండ

ఈ 1 న బోర్డు వున్నత పాఠశాల ఆవరణలో జరిగిన వనమహోత్సవ సందర్భంలో అసిస్టెంటు కలెక్టరు బాలసుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. వ్యవసాయ శాఖ వుద్యోగి కొండారెడ్డిగారు 'అడవులు-వాని వుపయోగాలు' అను విషయమును గూర్చి వుపన్యసించారు. శేషశర్మ, స్వామినాథన్‌గార్లుకూడా వుపన్యసించారు. తహశీల్దారు వెంకటనారాయణస్వాములవారి వందనాలతో సభ ముగిసింది.

### తెనాలి

స్థానికాధికారులు డిప్యూటీ కలెక్టరు ఎన్. ధనరాజు, తహశీల్దార్ ఆర్. రామానుజయ్య, ఎగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటర్ కె. జనార్దనరావు, ఎలెక్షన్ డిప్యూటీ తహశీల్దారు ఎ. నరసింహారావు, డిప్యూటీ తహశీల్దారు వీరరాఘవయ్యనాయుడు, మునిసిపల్ కమిషనర్ సి. వి. సుబ్బయ్యచౌదరి, మునిసిపల్ ఇంజనీరు కె. వెంకటస్వామిగార్లు, తదితరులు మునిసిపల్ పాఠశాలల బాలబాలికలతో కలసి యీ వుదయం వూరేగింపుగా బయలుదేరి గాంధీ - ఇర్విన్‌పార్కు, తాలూకా ఆఫీసు, జనరల్ హాస్పిటల్, డిప్యూటీ కలెక్టరు ఆఫీసు ఆవరణలలో మొక్కలు నాటారు. పౌరులను వారి వారి యిండ్లలో నాటమని కోరుతూ ధనరాజుగారు మొక్కలనుపంచిపెట్టారు. జనార్దనరావుగారు క్రొత్తరకం పత్తి మొక్కలను విరివిగా నాటించారు.

### ఉయ్యూరు

ఫిర్కా రెవిన్యూ ఇన్‌స్పెక్టరు గారు యీ 2 వుదయం స్థానిక రహదారి బంగళా, సబ్ రిజిస్ట్రారు ఆఫీసు ఆవరణలో విరివిగా మొక్కలు నాటించారు. వూరేగింపుగా వచ్చిన బాలబాలికలకు తదితరులకు సీతంరాజు లింగరాజుగారు తినుబండారాలు పంచిపెట్టారు.

### బెంగుళూరు

స్థానిక ఆంధ్ర బాలభారతి మండలి, పరమహంస మహాసభవారి సంయుక్తయాజమాన్యమున యీ 1 న బహిరంగ సభ జరిగింది. మీనాక్షీదేవి, పి. సరోజినీదేవి, ముద్దుకుమారీదేవి గారలు ప్రార్థనలు చేశారు. పి. చంద్రకుమార రాయులవారి బాలబృందము గానసభ నిర్వహించారు. సభకు అధ్యక్షత వహించిన పి. హెచ్. జగదీశచంద్ర రాయలవారు వనమహోత్సవము, బాలభట సంఘముల ఆదర్శాలను వివరించారు. డి. ఎస్. ప్రకాశరావు, వి. టి. గోపాలస్వామి అయ్యర్, సి. వెంకటరత్నంనాయుడు, డి. అయ్యాస్వామి మొదలియార్, డేవిడ్ మార్టిన్ ఎన్. పుల్లారెడ్డిగార్లు పలు సమస్యలపై ప్రసంగించారు. స్వర్గస్థులైన డా॥ చిలుకూరి నారాయణరావు, పంచాన్నుల ఆదినారాయణశాస్త్రిగారల మృతికి సభవారి తరఫున ఎస్. కామరాజు గుప్తగారు సంతాప తీర్మానం ప్రతిపాదించారు. అబూబేకర్ సాహెబ్ గారి వందనాలతో సభ ముగిసింది.

### సవరణ

జూన్ 28వ తే 'ఆంధ్రపత్రిక' లో మునిసిపల్ ఛైర్మన్ అధ్యక్ష పదవులకు డా॥ ఎ. బి. నాగేశ్వరరావు (రాజమండ్రి) డా॥ టి. వి. ఎస్. చలపతిరావు (విజయవాడ) గార్లు రాజీనామా లిచ్చినట్లు పొరపాటున ప్రకటించబడింది. వీరిద్దరూ పురపాలక సంఘ అధ్యక్షపదవులకు రాజీనామా లీయలేదని, డా॥ నాగేశ్వరరావుగారు యిప్పటికీ కాంగ్రెసులో ప్రాథమిక సభ్యత్వం కలిగివున్నారనీ గమనింప ప్రార్థన.

*　　*　　*

జూలై 3 వ తేది ఆంధ్రపత్రికలో విజయవాడ పట్టణకాంగ్రెస్ సమావేశం అన్న శీర్షిక క్రింది వార్తలో సదరు సమావేశానికి కాశేశ్వరరావుగారి అనుచరులలో పాటు చిట్టిగారి అనుచరులు గూడా రాలేదని సవరించవలెను. అంతేగాని కాశేశ్వరరావు గారి అనుచరులతో చిట్టిగారి అనుచరులు గూడా ప్రయోగ క్షేత్రంలో చేరటానికి ప్రయత్నిస్తున్నారని ప్రచురింపబడిన విషయము పరిగాదు.

# రాష్ట్ర వార్తలు

### మోరి

ఈ ఫిర్కా జాతీయ చేనేత కాంగ్రెసు కార్యవర్గ సమావేశం గత 26 న పిచ్చిక మల్లేశ్వరరావుగారి అధ్యక్షత నుజరిగింది. కొండా సుబ్బారావు, పృథ్వీ సూర్యారావు గార్లు ప్రత్యేక ఆహ్వానంపై హాజరైనారు. చట్టసమ్మతంగా నూలు కోటాలుపొందే హక్కు కలిగివుండి కూడా యిప్పటివరకూ పని చేసిన నూలు సరఫరా సంఘాల ద్వారా నూలుపొందని చేనేత పారిశ్రామికుల జాబితాలు తాము తయారు చేస్తున్నామనీ, ఆజాబితాలలో సూచించిన వారికి వుదారంగతో నూలు సరఫరా చేయించమనీ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

### శృంగవృక్షం

వీరవాసరం ఫిర్కా రెవిన్యూ ఇన్‌స్పెక్టరు కోసూరి రామచంద్రరాజు గారికి ఏలూరు కలెక్టరు కార్యాలయానికి బదిలీకాగా, వారి గౌరవార్థం పి. వెంకటచలంగారు ఇటీవల తేనీటివిందు చేశారు. అల్లూరి రామరాజుగారు వీడ్కోలు సందేశమిచ్చారు.

### నర్సాపురం

ఈ తాలూకా వ్యవసాయ కూలీ వర్కర్ల సమావేశం సయ్యపరాజు వెంకట గోపాలరాజుగారి అధ్యక్షతను గత 28వ ఇక్కడ జరిగింది. బోళ్ల రాఘవులుగారు సభను ప్రారంభించారు. అల్లూరి సత్యనారాయణరాజు గారు ప్రత్యేక ఆహ్వానితులుగా హాజరైనారు. తాలూకా సంఘ కార్యదర్శి డేనియల్ స్మిత్ గారు నివేదిక సమర్పించారు. అల్లూరి సత్యనారాయణ గారు వ్యవసాయకూలీ సంఘము ఆచరించవలసిన కార్యక్రమాదులను వివరించి, ఈ సంఘ కృషిలో తాము చేయ గలిగినంత సహాయము చేస్తామన్నారు. బోళ్ల రాఘవులు, నంబూరి శ్రీనివాసరావు గార్లుకూడా వుపన్యసించారు. సాయంకాలం నాటూరి అప్పారావుగారి అధ్యక్షతను నిర్ధారణ సభ జరిగింది. అరుణకుమార్, డేనియల్ స్మిత్, పాలపర్తి సరస్వతీరావు, నంబూరి శ్రీనివాసరావుగార్లు వ్యవసాయ కూలీ, పనుకట్టిన జాతులు, నిమ్న జాతుల కలయికను గూర్చి వుపన్యసించారు. రాత్రి 9 గంటలకు జరిగిన సమావేశంలో నిర్వాహకులను ఎన్నుకొన్నారు.

### వత్సవాయి

కృష్ణాబోర్డు అధ్యక్షులు కాకాని వెంకటరత్నంగారిచే యీ గ్రామమున (నందిగామతాలూకా) న జూన్ 27 న బోర్డు మిడిల్ స్కూలు ప్రారంభింపబడినది. ఆసందర్భమున జరిగిన సభకు నందిగామతాలూకా కాంగ్రెసు అధ్యక్షులు రేపాల బుచ్చిరామయ్య శ్రేష్ఠిగారు అధ్యక్షత వహించారు. జిల్లాబోర్డు సభ్యులు మదనేని సూర్యనారాయణగారు జిల్లాబోర్డు అధ్యక్షులకు స్వాగతమిచ్చారు. కాకాని వెంకటరత్నంగారు, పాఠశాల ప్రధానోపాధ్యాయులు సువ్వ సుబ్బారావుగారు విద్యావశ్యకత, తల్లి దండ్రుల బాధ్యతలను గూర్చి వుపన్యసించారు. పాఠశాలభవన నిర్మాణమును గూర్చి వెంటనే పూనుకోవలసినదని గ్రామస్థులను కోరారు.

### గుత్తి

ఇచటి లండను మిషను వున్నత పాఠశాలలోని ఉపాధ్యాయులు, విద్యార్థులు, జూన్ 30 న వి. కొండ్రేకాచారిగారి అధ్యక్షతను సమావేశమై డా॥ చిలుకూరి నారాయణరావుగారి మృతికి సంతాపమును వెలిబుచ్చారు.

## ఖూనీకేసు ముద్దాయిలు సెషన్స్‌కు పంపబడుట

నర్సరావుపేట, జూన్ 28: వినుకొండ తాలూకా కొండాయిపాలెమునకు చెందిన బెల్లపూడి మారయ్య గారిభార్య వెంకమ్మను 16-2-51 తేదీన హత్య చేశారని, సదరు గ్రామ కాపురస్థులను కరణం భద్రయ్య, కేతినేని తిరుపతెయ్య, శాఖమూరి కోటయ్య అనువారలపై మోపబడిన అభియోగమును, స్థానిక స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటు ప్రకాశంగారు విచారించి, ముద్దాయిలను విచారణ నిమిత్తం గుంటూరు సెషన్స్‌కు కమిట్ చేశారు. స్వ. వి.

## పార్వతీపురంలో పాకీవారిసమ్మె

పార్వతీపురం, జూన్ 29: స్థానిక పంచాయతీబోర్డు పాకీపనివారలు జీతాల హెచ్చింపుకోసం 26 వ తేదీ నుంచి సమ్మె సాగిస్తున్నారు. పంచాయతీబోర్డు ఉద్యోగస్తులు, స్థానిక హైస్కూలు, క్రైస్తవసంఘ స్కూలు విద్యార్థులు వీధులను శుభ్రపరుస్తున్నారు. ఈ సమ్మె ఎన్నాళ్లు జరుగుతుందో తెలియదు. (స్వ. వి.)

## స్వామి సీతారాం ఆంధ్రానంద యాత్ర

వల్లూరు, జూన్ 27: వినయాశ్రమ వ్యవస్థాపకు స్వామి సీతారాంగారు తమ ఆంధ్రానందయాత్ర సందర్భంలో అనంతపల్లినుంచి నేటిసాయంకాలం 4 గంటలకు యిక్కడకు వచ్చారు. డా॥ శ్రోత్రియ కేశవరావు, మేడిద చినబ్రహ్మయ్య,గార్లు భక్తసమాజం వారు సీతారాంగారికి స్వాగతమిచ్చారు. మేడిద చినబ్రహ్మయ్య గారి అధ్యక్షతను జరిగిన బహిరంగ సభలో 15-8-51 లోగా ఆంధ్రరాష్ట్రాన్ని స్థాపించమని ప్రభుత్వాన్ని ఆదేశిస్తూ ఒకతీర్మానం చేశారు.

# కోనసీమ కళాశాల ప్రారంభోత్సవం

## ఈ విద్యాసంస్థ అభివృద్ధికి కృషిచేయగలనని ప్రిన్సిపాల్ గారి హామి

అమలాపురం, జులై 2: హిందూమత సంప్రదాయానుసారం ఋత్విజుల వేదపఠనంతో శ్రీ కోనసీమ భానోజీ రామర్సు కళాశాల ప్రారంభోత్సవం, యీ ఉదయం 7 గం॥లకు జిల్లాబోర్డు హైస్కూలు భవనమున పేరూరు జమీందారు శ్రీ జల్లెళ్ళ వెంకటభానోజీ రామర్సుగారిచే జరుపబడింది. ఈ ఉత్సవంలో పాల్గొనుటకు పురప్రముఖులు చాలా మంది విచ్చేశారు. వీరందరిని చందనతాంబూలాదులతో సత్కరించడమైనది.

తెలుగు పండితులు కర్రా సుందర రామశాస్త్రిగారు కళాశాలకు ద్రవ్య సహాయం చేసిన దాతలకు, ముఖ్యంగా శ్రీ జల్లెళ్ళ వెంకట భానోజీ రామర్సును ప్రస్తుతిస్తు పద్యాలు చదివారు. హిందీపండితుడు మంథా సుబ్రహ్మణ్య శాస్త్రిగారు హిందీలో ప్రశంసాపద్యములు చదివారు. న్యాయవాది బి. యస్. శాస్త్రిగారు ప్రసంగిస్తూ, కోనసీమలో కళాశాలస్థాపన గర్వింపదగిన విషయమన్నారు. ఈ కళాశాల స్థాపనకుజరిగిన ప్రయత్నాన్ని వివరిస్తు యిలా అన్నారు: "1949 లో నే యిచట పెద్దలు సమావేశమై కళాశాల స్థాపించాలని నిర్ణయించారు. కాని అది అప్పట్లో సాధ్యపడలేదు. 1951 జనవరినుంచీ నడింపల్లి రామభద్రరాజు (ఎం. ఎల్. సి.) గారు, కమిటీలోని మిగతా సభ్యులు తిరిగి కృషి ప్రారంభించారు. ఈ జులైనెలలో, కళాశాల ప్రారంభింపబడునా అను సందేహం కలిగినప్పటికీ, పేరూరు జమీందారు గారు సహజ ఉదారభావంతో లక్ష రూ. లు విరాళ మిచ్చినందువల్ల కళాశాల ప్రారంభం సాధ్యమైంది. ఇందుకు వారెంతయు ప్రశంసనీయులు" కళాశాల నెలకొల్పుటకు హైస్కూలు భవనమొసంగిన జిల్లాబోర్డు అధ్యక్షుడు మారెళ్ళ వరసన్నగారికి, శాస్త్రిగారు కృతజ్ఞత తెలిపారు.

ఇంతవరకూ, కళాశాల నిధికి 2½ లక్ష రూ లు ప్రోగైనట్లు తెలుస్తున్నది. ప్రారంభోత్సవ సందర్భమున కళాశాల ప్రిన్సిపాల్ పెద్దాడ రామచంద్రరావుగారు ప్రసంగిస్తూ, కళాశాల అభివృద్ధి విషయంలో, అందరితోనూ సర్వవిధాలా సహకరించి కృషి చేస్తామని అన్నారు. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానములలోని ఉత్తమ ఆదర్శాలను, ఆకళింపు చేసుకొనేట్లు గా, విద్యార్థులకు శిక్షణ యివ్వడం అవసరమని చెబుతూ, రామచంద్రరావుగారిలా అన్నారు:

ప్రాచ్య, పాశ్చాత్య విజ్ఞానములు, ఏకైక మానవత్వాన్ని నిరూపిస్తున్నాయనే విషయము భగవదన్వేషణాపరులకే గోచరమగును. పాశ్చాత్యుల బుద్ధిబలము విద్యద్వారా పరిపూర్ణవికాసము నొందినది. కాని ఆత్మబలము కోల్పోయి వారు యుద్ధభయంచే ఆవరింపబడి, తత్సంబంధమైన పనులలో నిమగ్నులై ఉన్నారు. భారతీయులు, ఆధ్యాత్మికదృష్టి హెచ్చయిపోయి కేవలము అంతా కర్మయే ననుకొని బుద్ధిని వికాసము నొందించుకొనుటలో అశ్రద్ధ చూపుచున్నారు. విద్యాసంస్థల ద్వారా ప్రాచ్య, పాశ్చాత్య నాగరికతలను, ఆదర్శాలను, విజ్ఞానములను సమన్వయంచేసి విద్యార్థులకు సరియైన మార్గము చూపవలెను.

## తెనాలి కళాశాల

తెనాలి, జూలై 2: ఇచట నూతనంగా నెలకొల్పబడు కళాశాల ప్రారంభోత్సవం, యీ నెల 16వ తేదీన జరుగుతుందనీ. స్థానిక స్వపరిపాలన శాఖామంత్రి గా॥ చంద్రమౌళి, ఆర్థిక శాఖ మంత్రి బెజవాడ గోపాలరెడ్డి గారలు, ప్రారంభోత్సవమునకు ఆహ్వానింప బడినారని, కళాశాల కమిటీ సహాయ కార్యదర్శి పి. వి. సుబ్బారావుగారు తెలుపుతున్నారు.

## నిడుబ్రోలు కళాశాల

నిడుబ్రోలు, జులై 2: పాములపాటి బుచ్చినాయుడుగారు ఇక్కడ స్థాపించిన సెకండ్ గ్రేడ్ కళాశాలకు ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు 8 వ తేదీన ప్రారంభోత్సవం చేస్తారు. ఈ కళాశాలకు రంగాగారు అయిదు వేల రూపాయిలు ఖరీదుచేసే తమ గ్రంథాలయాన్ని ఇచ్చివేశారు. ప్రిన్సిపాలు డాక్టర్ పేటర్సగారు ఇవాళ ఛార్జీ పుచ్చుకుంటున్నారు.

## శ్రీ కె. చంద్రమౌళిగారు

మదరాసు, జులై 2: స్థానిక పాలన మంత్రి శ్రీ కె. చంద్రమౌళిగారు ఈ నెల 9వ తేదీన రామేశ్వరం వెడతారు. 12,13 తేదీల్లో ధనుష్కోటి, మధుర అలాంగులం, శ్రీ విల్లిపుత్తూరు చూచుకొని 14 తేదీన మదరాసు చేరెదరు.

మద్రాసు రాష్ట్ర ఆయుర్వేద ఫార్మసీల సంఘ ద్వితీయ మహాసభ, ఈ నెల 7వ తే మధ్యాహ్నం 2 గం విజయవాడ, గవర్నర్ పేటలో దివ్య జ్ఞానసమాజ మందిరము (థియసాఫికల్ లాడ్జి) లో జరుగును.

నటరాజను (40) రెండు ఆవులను దొంగిలించి ఒకదాన్ని చంపి ఇంకొక దాన్ని విక్రయించు చుండగా పోలీసులు అరెస్టు చేశారు.

రాజమ్మగు అను స్త్రీ పీపాలలో [illegible] పెరంబూరు పోలీసులు అరెస్టు చేసేరు.

# ఎకరానికి 54 బస్తాల పంట

అనంతపురం, జూన్ 30: రాయలసీమ జిల్లాలలో జరిగిన అధికపు పంట పోటీలో, ఎకరమునకు 54 పల్లాలవడ్లను పండించి మొదటి స్థానము సంపాదించిన బంప్లపల్లె రైతు సాంబయ్యకు నేడిచ్చట జరిగిన వనమహోత్సవ సందర్భంలో బంగారు పతకము రెండు వందల రూపాయలు బహుమాన మివ్వబడెను. (స్వ. వి.)

## అల్లూరి బాపినీడుగారి రాజీనామా ఉపసంహరణ

నిడదవోలు, జూలై 1: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సభ్యత్వానికి లోగడ రాజీనామా యిచ్చిన అల్లూరి బాపినీడుగారు తమ రాజీనామాను వుపసంహరించుకొనుటకు అనుజ్ఞ యీయవలసిందిగా రాష్ట్ర కాంగ్రెసును కోరారు. (స్వ. వి.)

## దక్షిణకొరియా నిర్ణయం

టోకియో, జూలై 3: కొరియా యుద్ధవిరమణపై జరిగే సంభాషణలలో పాల్గొనడానికి దక్షిణకొరియా ప్రభుత్వం నిశ్చయించినట్లు ప్యూసాన్ నుండి వచ్చిన వార్తలవల్ల తెలుస్తున్నది.

## బొంబై వెండిబంగారుమార్కెట్

బొంబై, జూలై 3: నేటి మధ్యాహ్నం 2 గం॥కు బొంబైవెండి బంగారు మార్కెట్ ధరలు: వెండి (100 తు) రు 191-8-0; బంగారం (తు 1 కి) రు 111-12-0; సావరిన్ 1 కి రు 77-8-0.

## హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్) మార్కెటు ధరలు

(సప్లయిదారు గుబ్బా బుచ్చయ్య గారి పెంపకం)

హైదరాబాదు, జూలై 3, బంగారం తులం 1, 130-0-0 ; వెండి 100 తు 222-0-0 3 ఎల్లా టకటక పసుపు 80.100 పెసలు 66-0-0 కందులు 54-58, మినుములు 86-0-0 గోధుమ 62-6-0 ఉలవలు 49-0-0 కందిపప్పు 73-0-0 కందిపప్పు చిన్నది 69-0-0, పెసరపప్పు 84-0-0 మినపపప్పు 123-0-0 పేరు సెనగపప్పు 120-0-0 ఆముదాలు 100-101 చింతపండు 45-55, మిర్చి 175-210 జనుములు 72-0-0 ధనియాలు 16 శెనగముడుగు 35-8-0 ఆవాలు 15-17 ఉల్లిగడ్డ పల్లా 1 కి 30-36

## జాఫ్రే విల్సన్

కొలంబో, జులై 2: బ్రిటిషు ఆర్థిక నిపుణుడు జాఫ్రేవిల్సన్ కొలంబో పథకం టెక్నికల్ కార్పొరేషన్ బ్యూరోకు డైరెక్టరుగా నియమించబడినాడు.

## సదరన్ రైల్వే.

1951-వ సం॥ జూలై 5-వ తేదినుండి కాట్పాడి - చిత్తూరు మధ్య నం. 94, 93 బండ్ల రాకపోకలవేళలు దిగువచూపిన విధముగా సవరింపబడును.

| నం. 94 దిగువకు చదవండి. గం. ని. | | స్టేషను | నం. 93 ఎగువకు చదవండి. గం. ని. |
|---|---|---|---|
| రా. | 12-20 పోక | కాట్పాడి | రాక ఉ. 4-10 |
| రా. | 12-43 ,, | బొమ్మసముద్రం | పోక ఉ. 3-40 |
| రా. | 1-01 ,, | రామాపురం | పోక ఉ. 3-28 |
| | — | పెయనపల్లి హాల్టు. | — |
| రా. | 1-45 రాక | చిత్తూరు | పోక రా. 2-40 |

కాట్పాడివద్ద నం. 94 కాట్పాడి-చిత్తూరు లోకల్ ప్యాసెంజరు నం 20 బెంగుళూరు - మద్రాసు ప్యాసెంజరుకు కలుపును. కాట్పాడివద్ద నం. 93 చిత్తూరు-కాట్పాడి ప్యాసెంజరు నం. 8 బెంగుళూరు - మద్రాసు మెయిలుకు బదులు నం. 14 బెంగుళూరు - మద్రాసు మెయిలుకు కలుపును.

# పాకిస్తాన్‌పై ఫిర్యాదు

(1 వ పేజీ తరువాయి)

మాలిక్ భద్రతామండలి అధ్యక్షుడుగా ఉన్న సమయంలో భారత ప్రభుత్వం ఈ లేఖ పంపినది. ఈ నెలలో బ్రిటిష్ ప్రతినిధి సర్ గ్లాడ్విన్ జెబ్ మండలి అధ్యక్షుడుగా వ్యవహరిస్తున్నారు.

ప్రధానమంత్రి లేఖతో పాటుగా మండలి అధ్యక్షునికి పంపిన సందేశంలో "పండిత నెహ్రూ లేఖను భద్రతామండలి సభ్యులందరికీ అందచేయవలసిన"దని శ్రీ బి. యన్. రావు కోరారు.

## మేజర్ జనరల్ నిమ్మో రావల్పిండి ప్రయాణం

శ్రీనగర్, జూలై 2: యుద్ధ విరమణ సంధి షరతులను ఉల్లంఘించి, పాకిస్తాన్ సైనికులు జరిపిన అత్యాచారాలపై పాకిస్తాన్ సైన్యాధికారులతో చర్చించే నిమిత్తం సమితి ప్రధాన పరిశీలకుడు మేజర్ జనరల్ నిమ్మో యీరోజున శ్రీనగర్ నుండి రావల్పిండికి బయలుదేరారు. నిన్న భారతసైన్యాధిపతి జనరల్ కరియప్పతో ఇక్కడ జరిపిన సంభాషణల పర్యవసానంగా రావల్పిండికి వెళ్ళడానికి ఆయన నిశ్చయించారు.

# కాశ్మీరు సమస్య శాంతియుత పరిష్కారం

## సాధ్యమేనని సమితి మధ్యవర్తి విశ్వాసం

న్యూఢిల్లీ, జూలై 2: సమితి కాశ్మీరు మధ్యవర్తి డాక్టర్ ఫ్రాంక్ పి. గ్రాహమ్ నేటి అపరాహ్ణం కరాచీ నుండి విమానంలో ఇక్కడికి చేరుకున్నారు.

"కొరియా వివాదం పరిస్థితిలో వచ్చిన మార్పు ప్రపంచంలోని ఇతర వివాదాలను కూడా శాంతియుతంగా పరిష్కరించ వచ్చుననే ఆశాభావం కలిగిస్తున్న"దని విమానాశ్రయంవద్ద ఆయన చెప్పారు.

అమెరికా వైమానికబలానికి చెందిన డకోటా విమానంలో తనతోడి అధికారబృందంతో ఆయన ఇక్కడికి వచ్చారు. విమానాశ్రయంవద్ద భారత ప్రభుత్వ సంస్థానాలశాఖ కార్యదర్శి శ్రీ ఎన్. ఎమ్. బుచ్, ఛీఫ్ ఆఫ్ ప్రోటోకాల్ శ్రీ ఐ. ఎస్. చోప్రా, అధ్యక్షుని మిలిటరీ కార్యదర్శి కర్నల్ ఛటర్జీ, అమెరికా కార్యాలయాధికారులు డాక్టర్ గ్రాహమ్‌కు స్వాగతమిచ్చారు.

విమానంనుండి క్రిందికి దిగగానే ఆయన తనవద్ద సిద్ధంగా ఉంచుకున్న ప్రకటనను చదివి పత్రికావిలేఖరులకు వినిపించారు.

ఆయన ఇలా ప్రకటించారు:— "ప్రపంచదేశాలతోపాటు తో కాశ్మీరు వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించగలమనే ఆశాభావం నాకు ఉన్నది."

ఇండియాకు రావటం తనకు చాల సంతోషకరంగా ఉన్నట్లు ఆయన చెప్పారు.

డాక్టర్ గ్రాహమ్ ప్రభుత్వ భవనంలో ఉంటున్నారు. ఆయనతో కూడా ఆయన సైనికసలహాదారు జనరల్ జాకోబ్ ఎల్. డేవర్స్, కార్యదర్శి పి. ష్మిడిట్, న్యాయశాస్త్ర సలహాదారు మిసెస్ మారిన్, రాజకీయ ఉద్యోగులు ఫిలిప్ డి. ఎస్టెర్హాజీ, డేవిడ్ విక్‌స్టాఫ్ ఇక్కడికి వచ్చారు.

డాక్టర్ గ్రాహమ్ యీరోజున భారత ప్రభుత్వ విదేశాంగశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయిని, రేపు సంస్థానాలశాఖా మంత్రి శ్రీ ఎన్. గోపాలస్వామి అయ్యంగారిని కలుసుకుంటారు. ఆయన జూలై 4 వ తేదిని భారత ప్రధాని పండిత నెహ్రూను కలుసుకుంటారు.

## రాజకీయ వర్గాలవారి వ్యాఖ్య

డాక్టర్ గ్రాహమ్ మధ్యవర్తిత్వం సఫలమౌతుందనే ఆశాభావం ఇక్కడి రాజకీయ వర్గాలవారికి లేదు. డాక్టర్ గ్రాహమ్‌ను మధ్యవర్తిగా నియమిస్తూ మార్చి 30 వ తేదిని భద్రతామండలి చేసిన తీర్మానాన్ని భారతప్రభుత్వం నిరాకరించినది. కాశ్మీరు రాజ్యాంగ పరిషత్తు స్థాపన ప్రయత్నాలను విరమించుకోవాలని ఆ తీర్మానంలో మండలి సూచించినది. యీ సూచనను భారత ప్రభుత్వం నిరాకరించినది.

1948 ఆగస్టు 13, 1949 జనవరి 5 తేదీలలో సమితి కాశ్మీరు సంఘం చేసిన తీర్మానాల ప్రాతిపదికపై కాశ్మీరు సంస్థానంనుండి ఇండియా, పాకిస్తాన్‌ల సైన్యాల ఉపసంహరణ జరిగేటట్లు చేయటం మధ్యవర్తి ప్రధాన కర్తవ్యం. ప్లెబిసైట్ జరపడానికి ముందు సంస్థానంలోని సైన్యాలు అక్కడే ఉంటాయి. ఉపసంహరింపబడే ... [illegible] ... ప్లెబిసైట్ ... [illegible] ... అధికారాలు, ... [illegible] ... మధ్యవర్తి సర్ ఓయిన్ డిక్సన్ ... యించారు.

పైన ఉదహరించిన రెండు తీర్మానాలను, కాశ్మీరు సంఘం ... [illegible] ... సైన్యాలు నిలిపే అధికారం తనకు ఉన్నదని పాకిస్తాన వాదిస్తున్నది.

కాశ్మీరు రక్షణ బాధ్యత ఇండియాపై ఉన్నది. అందువల్ల ఆ బాధ్యతా నిర్వహణకు భంగకరమైన షరతులను ఇండియా అంగీకరించదు. దురాక్రమణకు పూనుకొన్న దేశం కావటంచేత ప్లెబిసైట్ నిర్వహణలో పాకిస్తాన్‌కు ఎట్టి అధికారము ఉండకూడదు. మధ్యవర్తి నిర్ణయం ద్వారా ఈ తగవు పరిష్కరించుకోవడానికి కూడా ఇండియా అంగీకరించదు. తన సార్వభౌమాధికారానికి భంగకరమైన నిర్ణయాలను ఏదేశము అంగీకరించ లేదు.

## బాజ్‌పాయితో కాశ్మీరు మధ్యవర్తి సంభాషణలు

న్యూఢిల్లీ, జూలై 2: సమితి కాశ్మీరు డాక్టర్ ఫ్రాంక్ గ్రాహమ్ ఈరోజున విదేశాంగ శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ గిరిజాశంకర్ బాజ్‌పాయిని కలుసుకుని, ఆయనతో 1 గంట 15 నిముషాలసేపు సంభాషణలు జరిపారు. ఈ సమావేశంలో కాశ్మీరు వివాదంపై చర్చలు జరుగలేదని తెలుస్తున్నది.

డాక్టర్ గ్రాహం రేపు అపరాహ్ణం ప్రధానమంత్రి పండిత నెహ్రూను కలుసుకుంటారు. ఆయన రేపుఉదయం రాజఘాట్‌లోని గాంధీజీ సమాధి సందర్శిస్తారు.

# బ్రిటన్‌పై ఫిర్యాదు

(1-వ పేజీ తరువాయి)

చేయటానికి ఏర్పాట్లు పూర్తి అయినవని టెహరాన్‌లో బ్రిటిషు రాయబారి కార్యాలయ సలహాదారు మిడిల్టన్ నేడు వెల్లడించారు. పూర్తిగా కర్మాగారాన్ని మూసివేసి, సిబ్బందిని ఖాళీచేస్తున్నామని పర్షియా జాతీయ కంపెనీ అధికారులకు తెలియజేసే ముసాయిదా తయారవుతున్నదని ఆయన తెలియజేశారు.

## బ్రిటన్ బెదిరింపులు: భద్రతామండలికి ఫిర్యాదు

లండన్, జూలై 2: నూనె జాతీయకరణ ప్రయత్నాలను అడ్డగించటానికి బ్రిటన్ బెదిరింపులకు పూనుకున్నందువల్ల 'తగిన అధికారం గల అంతర్జాతీయ సంస్థలకు, ఫిర్యాదుచేయటం న్యాయమే అవుతుందని పర్షియా అభిప్రాయపడుతున్నది." అని నేడిక్కడ పర్షియా రాయబారి కార్యాలయం చేసిన ప్రకటన తెలియజేసినది. ఆ రాయబారి కార్యాలయానికి చెందిన ఒక ఉద్యోగి తరవాత దీనిమీద వివరిస్తూ 'తగిన అధికారంగల అంతర్జాతీయ సంస్థ' అంటే భద్రతా మండలి కావచ్చునని సూచించారు. అయితే ఫిర్యాదు చేసే విషయమై నిర్ణయం మాత్రం జరగలేదని ఆయన తెలియజేశారు.

అంతర్జాతీయ న్యాయస్థానానికి ఈ వివాదాన్ని విచారించే అధికారం లేదని పర్షియా ప్రభుత్వం లోగడ చేసిన ఉద్ఘాటనను హేగ్‌లో పర్షియా రాయబారి నేడు తిరిగి ఉద్ఘాటించారు. నేడు అంతర్జాతీయ న్యాయస్థానం బ్రిటన్ ఫిర్యాదుమీద తమ నిర్ణయాన్ని ప్రకటించే టప్పుడు పర్షియా ప్రతినిధు లెవ్వరూ హాజరుకారని ఆయన తెలియ చేశారు.

## మారిజన్‌కు మొసాదిక్ జవాబు కరుగ్గాఉండే సూచన

బ్రిటిష్ విదేశాంగమంత్రి మారిజన్ లోగడపంపిన సందేశానికి పర్షియా ప్రధాని మొసాదిక్ చాలా కరుగ్గా సమాధానం పంపబోతున్నారని టెహరాన్ రాజకీయ వర్గాలు నేడు సూచించారు. పర్షియా నూనె పరిశ్రమను విద్రోహ చర్యలద్వారా ధ్వంసం చేయాలని బ్రిటన్ ప్రయత్నిస్తున్నట్లు మొసాదిక్ అందులో ఆరోపిస్తారని తెలుస్తున్నది. అబదాన్‌నుంచి పూర్తిగా నిష్క్రమించటంద్వారా పర్షియా ప్రభుత్వాన్నే కూలదోయాలని బ్రిటిష్ ప్రభుత్వం, ఆంగ్లో ఇరానియన్ కంపెనీలు ప్రయత్నిస్తున్నవనీ, వాటికి లొంగకుండ యావత్తు నూనె పరిశ్రమను మూసివేయటానికే పర్షియా సిద్ధంగా ఉన్నదనీ మొసాదిక్ తెలియజేయగలరని భావించ బడుతున్నది.

పర్షియా ప్రధాని జవాబు త్వరలోనే బ్రిటనుకు అందజేయ బడుతుందని తెలుస్తున్నది.

## మాస్కో రేడియో వ్యాఖ్య

మారిజన్ సందేశం (శనివారం పంపినది) పర్షియా ప్రభుత్వాన్ని బెదిరించేదిగా ఉన్నదని మాస్కో రేడియో నేడు వ్యాఖ్యానించినది.

"పర్షియా ప్రభుత్వం తొలి సంప్రదింపులను గురించి మళ్లీ ఆలోచన కూడా చేయకుండా 'అతితీవ్ర పరిణామాలకు' దారితీసే విధానాన్ని అనుసరిస్తున్నది." అని మారిజన్ తన సందేశంలో ఉద్ఘాటించారు.

## కంపెనీ మానేజర్‌తో బ్రిటిష్ మంత్రివర్గ సమాలోచన

ఆంగ్లో ఇరానియన్ కంపెనీ జనరల్ మానేజర్ ఎరిక్ డ్రేక్‌ను బ్రిటిష్ మంత్రివర్గం నేడు సమాలోచనలకు పిలిపించినది. ఈ సమావేశంలో బ్రిటిష్ సాయుధ బలాల అధిపతులు కూడా పాల్గొన్నారు.

[illegible] ... విడిచిపెట్టి వచ్చారు.

## కర్ణాటక విశ్వవిద్యాలయం

ధార్వార్, జూలై 2: ... [illegible] ... విశ్వవిద్యాలయ ... [illegible] ... వ్యక్తులుగా ఎన్నుకొనబడ్డారు.

# న్యూస్‌ప్రింట్ కొరత

## ప్రభుత్వానికి పత్రికోద్యోగి సూచన

బొంబాయి, జూలై 1: ప్రపంచములో న్యూస్‌ప్రింటుకు ఏర్పడిన కొరతను ఆవకాశంగా తీసుకునిస్కాండినేవియన్ దేశాల ఉత్పత్తిదారులు భారతీయ వాడకం దారులను ఇబ్బంది పెట్టకుండా భారతప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవలెను. అని టైమ్సు ఆఫ్ ఇండియా జనరల్ మానేజర్ జె. సి. జైన్ నేడొక హెచ్చరిక చేశారు.

ప్రస్తుతం భారతపత్రికలు న్యూస్‌ప్రింటుకు పెడుతున్న ధరలు ఎంతో బాగా స్థిరపడ్డ పత్రికలకు కూడా గిట్టింపుగా లేవు. బ్రిటనుకు ఏధరకు సప్లయి అవుతున్నదో ఆధరకే ఇండియాకు కూడా సప్లయి అయ్యేట్లు భారత ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవలెను. న్యూస్‌ప్రింటు టన్ను 1 కి అమెరికా 106 డాలర్లను బ్రిటన్ 72 డాలర్లను, ఇండియా 105 డాలర్లను చెల్లిస్తున్నవి. సరసమయిన ధరలకు న్యూస్‌ప్రింటును సంపాదించటానికి భారతీయ వాడకందారులంతా కలిసి కృషిచేయవలెను అని ఆయన సూచించారు.

న్యూస్‌ప్రింట్‌కోసం పశ్చిమదేశాలన్నీ తిరిగి ఈయన నేడే తిరిగి వచ్చారు.

## లెబనాన్‌లో అవాంతర పరిస్థితి

లండన్, జూలై 1: నేడు లెబనాన్‌లో అవాంతరపరిస్థితి ప్రకటింపబడినదని జెరూసలేం రేడియో చేసిన ప్రకటన ఇక్కడ వినిపించినది. బైరూట్‌లో 500 మంది ప్రదర్శన కారులకూ పోలీసులకూ సంఘర్షణ జరగటంవల్ల ఈ పరిస్థితి ఏర్పడినదనీ, ప్రదర్శనకారులు కమ్యూనిస్టులని తెలుస్తున్నదని ఆ ప్రకటన వెల్లడించినది.

సంఘర్షణలో ఇద్దరు మరణించినట్లూ, ఒకరు గాయపడినట్లూ, 60 మంది అరెస్టయినట్లూ జెరూసలేం రేడియో ప్రకటించినది. బైరూట్ రేడియో విదేశీ ప్రసారంలో ఈప్రస్తావన లేదు.

## భీమాకంపెనీ ఉద్యోగుల సమావేశం

బొంబాయి, జూలై 1: రెండురోజులపాటు ఇక్కడ జరిగిన అఖిలభారత ఇన్స్యూరెన్స్ ఉద్యోగుల సమావేశం నేడు ముగిసినది. గౌరవంగా బతకటానికి అవసరమయిన జీతభత్యాలు తమకు లభింపచేసేట్లు ప్రభుత్వం శాసనం చేయాలని ఈ సమావేశం తీర్మానించినది.

## ఈజిప్టు స్టర్లింగ్ బాకీలు

### పదిసంవత్సరాల ఒప్పందం

అలెగ్జాండ్రియా, జూలై 1: ఈజిప్టుకు చెల్లించవలసిన స్టర్లింగుబాకీల సమస్యపైన బ్రిటన్ నేడు పది సం॥ల ఒప్పందాన్ని చేసుకున్నది. దీని ననుసరించి బ్రిటన్ తక్షణం 2½ కోట్ల పౌన్లను చెల్లిస్తుంది.

## గోరక్‌పూరు-అలహాబాదు ప్యాసింజరుకు ప్రమాదము

కాశీ, జూలై 1: గోరక్‌పూరు-అలహాబాదు ఫాస్టు ప్యాసింజరు గతరాత్రి ఓ. టి. రైల్వేలో హాట్నికి 20 మైళ్లదూరమున పట్టాలనుండి తొలగిపోయెను. ఎవ్వరికీ గాయములు తగిలినట్లు తెలియలేదు. ఈ ప్రమాదానికి కారణం తెలియలేదు. చాలా గంటలవరకు రైల్వే లైనుమీద రైళ్ల రాకపోకలు బందయ్యెను.

శ్రీనగర్, జూలై 1: శ్రీ గోపాలస్వామి అయ్యంగారు నేటి ఉదయము భారత సర్వసేనాపతి జనరల్ కరియప్పగారితో అరగంటసేపు సంభాషించారు. సరిహద్దు దాడులనుగూర్చి, వాటిని ఆపుచేయుటకు తీసుకొనవలసిన చర్యలనుగూర్చి చర్చలు జరిగినవని తెలుస్తున్నది.

## లండనుకు రాధాకృష్ణన్‌గారి రాక

లండన్, జూలై 2: రష్యాలోని భారత ప్రభుత్వ రాయబారిగా డా॥ రాధాకృష్ణనుగారు ఐక్యరాజ్యసమితి విద్యావిజ్ఞానసాంఘిక విషయ మహాసభకు భారత ప్రతినిధిగా హాజరగుటకై ప్యారిసునగరమునకు విచ్చేసిరి. గతవారం కమలకుమారీ పారిసునుండి లండనుకు వచ్చి అచటి బ్రిటిషు విదేశాంగ కార్యాలయమునందు బ్రిటిషు విదేశాంగ సహాయ మంత్రియగు కెన్నెత్ యంగరుగారిని కలిసికొని మాట్లాడెరి. అంతర్జాతీయ వ్యవహార పరిస్థితులను గూర్చి సామాన్యంగా కొన్ని విషయములు చర్చించిరి. నేటి రాత్రి రాధాకృష్ణనుగారు తిరిగి ప్యారిసునగరమునకు పోవుచున్నారు. అచటినుండి మాస్కోకు మరలి పోవుచున్నారు.

## సుమిత్రా దేవిపై క్రొత్త నానెగను

[illegible] ... జూలై 2: ... [illegible] ... లక్షింపకుండా అంచనా వేయబడినది.

# క్రీడారంగం

## ప్రెసిడెన్సీ ఫుట్‌బాల్ టూర్నమెంటు

మద్రాసు, జూలై 3: ప్రెసిడెన్సీ ఫుట్‌బాల్ టూర్నమెంటులో నిన్న సాయంకాలం జరిగిన ఆట యందు మాగ్ లైట్ లెదర్ వర్క్సు జట్టునకు శివాజీ మెమోరియల్ ఫుట్‌బాల్ క్లబ్బు జట్టునకు 'డ్రా' అయినది. ఉభయపక్షములు చెరి రెండు గోలులు చేసినవి. ఈఆట మద్రాసు విరెండ్ గ్రౌండ్సులో జరిగినది.

## త్రిలక్రికెటు టెస్టు

వోర్ స్టర్, జూలై 2: ఇంగ్లండుకు ఆస్ట్రేలియాకు జరుగుతున్న త్రిల క్రికెటు టెస్టు నందు ఇంగ్లండు మొదటి ఇన్నింగ్సులో 158, రెండవ ఇన్నింగ్సులో 120 పరుగులు చేసెను. ఆస్ట్రేలియా జట్టు మొదటి ఇన్నింగ్సులో 120 రెండవ ఇన్నింగ్సులో నేటి సాయంకాలం ఆట ముగిసే సమయమునకు మూడు వికెట్లు నష్టమునకు 59పరుగులు చేసిరి.

## వింబుల్‌డన్ టెన్నిస్

లండన్, జూలై 2: వింబుల్‌డన్‌లో జరుగుతున్న ఆల్ ఇంగ్లండు టెన్నిస్ ఛాంపియన్ షిప్పు పోటీల యందు నేడు అమెరికా ఆటగాడు హెర్బ్ ఫ్లామ్, ఆస్ట్రేలియా ఆటగాడు ఫ్రాంక్ సెడ్గ్‌మాన్‌ను క్వార్టరు ఫైనల్సులో 2-6, 1-6, 6-3, 6-4, 7-5 స్కోరుతో ఓడించెను. ఇప్పుడు ఫ్లామ్ సెమీ ఫైనల్సులో రిచర్డు సావిట్‌తో ఆడును. రెండవ సెమీఫైనల్సులో ఎరిక్ స్టర్‌గెస్, కెన్ మెక్‌గ్రెగర్ ఆడుదురు.

# రేడియో

## జూలై 5 గురువారం

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు వలె 8 ఆంగ్లమున వా॥.

మ॥ 1 మద్రాసు (బి) వలె 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 4 చిత్రవాణి (రి).

సా॥ 5.30 పి. ఎస్. వైదేహి 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 గీతమంజరి (రి) ఘంటసాల వెంకటేశ్వరరావు 6-30 గ్రామసుల కార్యక్రమం వ్యవసాయ గోష్ఠి జాతీయగేయము రచన కవికొండల వెంకటరావు విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామసుల కార్యక్రమం గీతావళి వి. బి. వర్మ 7-30 సంగీత శిక్షణ 7-45 దసాను పాటిల పులుగుండ్ల రామకృష్ణయ్య 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 పి. ఎస్. వైదేహి 9 ఆంగ్లమున వా॥ 9-15 టి. పద్మనాభరావు 9-30 ముగింపు.

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 స్వాగతము 7-30 వి. అనంతరామన్ 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 ఎస్. రామయ్య 1 మహిళామండలి మరపు తెరలు భావగీతం నాయికలు కలహాంతరిత ప్రసంగం జి. వి. కమలమణి వీణా వాద్య సంగీతం ఉద్యానము ప్రసంగం ఎం. ప్రభావతి దేవి 1-30 ఆంగ్లమున వా॥ 1-40 హిందీలో వా॥ 1-50 ఫిలిం సంగీతం (రి) కె. వి. సుందరాంబాళ్ వి. నాగయ్య సి. హెచ్. ఆర్మా 2-10 హిందీపాఠము తమిళమున 2-30 గానమంజరి (బి) రత్నమాల గీతగాంధి వేలా మేలా 4 (బి) వలె 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 దిమద్రాస్ కార్పొరేషన్ బాండ్ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 జయలక్ష్మీ సుందరరామన్ 7 క్లారినెట్ విలయ విద్వాంసుడు 7-30 తమిళమున ప్రసంగం 7-45 (బి) వలె 8-15 రాగం తానం పల్లవి ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్ కుంభకోణం రాజమాణిక్యంపిళ్ళె వయొలిన్ పళని సుబ్రహ్మణ్యపిళ్ళె మృదంగం 9 ఆంగ్లమున వా॥ 9-15 పుస్తక పరిచయ ఆంగ్లమున 9.30 (బి) వలె 10 పాశ్చాత్య సంగీతం (రి) 10-30 ముగింపు.

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7.15 ఎస్. పి. వసంత కోకిలం (రి) 7.30 (ఎ) వలె.

మ॥ 12-30 కార్మికుల కార్యక్రమం 1-0 గీతమాలిక (రి) 1-30 (ఎ) వలె. 1-40 ఫిలిం సంగీతం (రి) ఓ. ఆర్. రాజకుమారి. తిరుచ్చి లోకనాథన్, మీనాకపూర్. 1-50 తెలుగున వా॥ 2 చిత్రాడా విలయవిద్వాంసుడు, 2-10 హిందీ పాఠము. 2-30 (ఎ) వలె. 4 సి. వి. సంపూర్ణం.

సా॥ 5.30 (ఎ) వలె. 6.20 సాయంసంగీతం (రి) 6.30 గ్రామసుల కార్యక్రమం. వ్యవసాయగోష్ఠి, జాతీయగేయము. రచన కవికొండల, విశేషాలు, ప్రకటనలు, ధరలు, వాతావరణము. 7 తెలుగున వా॥ 7-15 గ్రామసుల కార్యక్రమం. వి. బి. వర్మ. 7-30 సాహిత్య సింహావలోకనము. ఆధునిక తెలుగుసాహిత్య ధీతుల సమీక్ష. కొడవటిగంటి కుటుంబరావు. 7.45 గీతమంజరి (రి) ధ్యానసౌందరి, ఏ పైపడుం పాడు, ఒన్కొల్ ఘడీ, రతన్. 8 తేరే దేశ జాన వద గయా. 8-15 (ఎ) వలె 9.30 సువర్ణ స్వప్నము. కాళిదాస దివ్యస్మృతి కార్యక్రమం. 10 సినిమాపాటలు (రి) సలతండి తిన్నియన్ రాధరి, మద్రిమారి. అరుణ రవిలేఖ, సచార్. సిలి, పతంగ. 10.30 ముగింపు.

### హైదరాబాద్

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 హిందీలో వేటి కార్యక్రమ సమీక్ష, 7-20 ఎస్. సి. రామానుజాచారి. 7-50 ఉజ్జా కమలాబాయ్ పోద్దార్. 8 ఆంగ్లమున వా॥ 8-15 ధ్యాద్రఫిజర్. మామూద్ బేగ్. 8.25 బయార్ జాస్పారి. జమలా బాయ్ పోద్దార్. 8.45 గిటార్. ఇదాసిన.

మ॥ 12-30 మధురగానమ్ (రి) 1 ఫ్లూటు 1-30 ఆంగ్లమున వా॥ 1-40 పద్యావళి (రి) 1.50 తెలుగున వా॥.

సా॥ 5.30 బాలవినోదం సంగీత సభ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6.20 ఎం. వైదేహి 6-45 గ్రామసీమ గీరావళి ఎం. వెంకట నరసింహాచారి 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ ఆదివాహోత్సవ సంభాషణ వలె వెంకట నరసింహాచారి ... [illegible] ... వాతావరణము 8.15 ... [illegible] ... 8.30 ... [illegible] ... 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 ... పాటం (రి) 10-15 ముగింపు.

# న్యూ ఇండియా అష్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ బొంబాయి.

న్యూ ఇండియా అష్యూరెన్సు కంపెనీ అగ్నిశాఖకు 1950 వ సం॥న రు. 1,69,74,000 ల ప్రీమియం రాబడివచ్చింది. రు. 63,84,000 లకు క్లెయిములు కలిగినవి. మానేజిమెంటు ఖర్చులు, కమిషను, విదేశపు పన్నులు మొత్తము రు. 75,22,000 లు, అనగా ప్రీమియంరాబడికి 44.3% అయినవి. అదనపు రిజర్వుకు రు. 4,00,000 లు చేర్చగా మిగిలిన రు. 28,00,000 లు లాభనష్టముల కాతాకు జమకట్టబడింది. రిజర్వుల మొత్తం 1949 అంతమున 1,15,30,000 లు ఉండినది 1950 అంతమునకు రు. 1,21,05,000 లకు పెరిగింది.

మిసిలేనియస్ భీమాశాఖకు రు. 37,63,000 ల ప్రీమియపు నికరాదాయం వచ్చింది. రు. 13,71,000 లకు క్లెయిములు కలిగినవి. కమిషను, మానేజిమెంటు ఖర్చులు, విదేశ పన్నులు చేరి ఈ సంవత్సరపు ప్రీమియములకు 30.3% అయినవి. అదనపు రిజర్వుకు రు. 3,00,000 లు చేర్చగా మిగిలిన రు. 9,62,000 లు లాభనష్టముల కాతాకు చేర్చబడింది. రిజర్వుల మొత్తం 1949 అంతమున రు. 31,34,000 లు ఉండినది 1950 అంతమున రు. 35,05,000 కు హెచ్చింది.

నౌకాశాఖకు రూ. 62,42,000 ల ప్రీమియపు నికరాదాయం వచ్చింది. రు. 18,86,000 లకు క్లెయిములు కలిగినవి. అదనపురిజర్వుకు రు. 11,00,000 లు చేర్చగా మిగిలిన రు. 15,68,000లు లాభనష్టముల కాతాకు చేర్చబడింది. ఈ శాఖ నిధులు 1949 అంతమున రు. 86,05,000 ఉండినది 1950 అంతమున రు. 1,03,42,000 అయినది.

జీవితశాఖలో ప్రస్తావన పాలసీల భీమా మొత్తం రు. 13,44,72,000లకు క్రొత్త పట్టాలు జారీచేయబడినవి. 1950 సంవత్సరాంతమున రూ. 63,01,07,000 లకు 1,80,258 సాధారణ పట్టాలు అమలులో ఉండినవి. 1950 సం॥న రూ. 8,24,87,000 ల ప్రీమియపు నికరాదాయము కలిగినది. రూ. 50,82,000 లకు క్లెయిములు కలిగినవి. ఈ సంవత్సరాన ప్రీమియం రాబడికి 29.1% న మానేజిమెంటు ఖర్చులైనవి. జీవితనిధి 1949 వ సంవత్సరాంతాన రు. 10,77,54,000 లు ఉండినది 1950 సంవత్సరాంతాన రు. 12,82,27,000 లకు హెచ్చింది.

ఈ సంవత్సరము లాభనష్టముల కాతాకు రు. 54 లక్షలు చేర్చబడింది. ఈకాతానుంచి పన్నుల రిజర్వుకు రు. 26 లక్షలు, జనరల్ రిజర్వుకు రు. 16 లక్షలు, డివిడెండ్ ఈక్వలైజేషన్ ఫండుకు రు. 3 లక్షలు చేర్చగా రు. 10 లక్షలు మిగిలినది. ఇందునుంచి రాబడిపన్ను లేకుండ షేరు 1-కి రు. 2 ల చొప్పున డైరెక్టర్లు డివిడెండును సిఫారసు చేసిరి.

న్యూ ఇండియా అష్యూరెన్సు కంపెనీ వ్యాపారం విదేశాలలోకూడ విస్తృతంగా అభివృద్ధి చెందుతున్నది.









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.